Photo by P. K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

నాతో నేనే ఆడుకొంటా

పంపినవారు :
ఎం. వి. చలం - రాజమండ్రి

ఫౌన్‌టెన్ కలములకు,
సిరాలకు
జగత్ప్రసిద్ధి పొందిన
పేరు

# పైలట్

మరల ఇప్పుడు
భారతదేశములో
ప్రతి చోట
లభించుచున్నవి

*

నాణ్యమునకు
సూచి

MANUFACTURED BY:
THE PILOT PEN CO. (INDIA) LTD.
CATHOLIC CENTRE, MADRAS-1.

---

## చందమామ, కినిమాలకు

ఈ ఊళ్లలో ఏజెంట్లు కావాలి !

★

గొల్లప్రోలు (తూ. గోదావరి)
ఛత్రపూర్ (గంజాం)
ఖాజీపేట (దక్కన్)
దుగ్గిరాల (గుంటూరు)

డిపాజిట్ చెల్లించగలవారు
వివరములకు వ్రాయండి.

★

చందమామ పబ్లికేషన్స్
వడపళని :: మద్రాసు–26.

---



## ఆంధ్రుల చరిత్ర సంస్కృతి

ప్రతి ఆంధ్రుడు చదువ దగిన సద్గ్రంథము. ఆంధ్ర రాష్ట్ర సాధనకు మిక్కిలి తోడ్పడిన గ్రంథము.

పే. 500. వెల రు. 6 0 0



## బాలసరస్వతి పిక్‌టోరియల్ మీడియం డిక్షనరి

( ఇంగ్లీషు–ఇంగ్లీషు–తెలుగు )

విద్యకు, విజ్ఞానానికి, పరీక్షలో విజయానికి ఈ డిక్షనరీ వుపయోగపడుతుంది. 1000 పేజీలు. పూర్తి క్యాలికో బైండు

మీడియం ధర 9 0 0
జెం డిక్షనరీ ధర 4 8 0



## గానకళాబోధిని

అపూర్వ సంగీత గ్రంథము. గొప్ప అనుభవజ్ఞులచే రచింపబడినది. సంగీతము నేర్చుకొనుటకు, సాధనకు, పరీక్షలకు పిన్నలకు పెద్దల కుపయుక్తపడు గ్రంథ రాజము.

పే. 1000. రు. 10 0 0

---

తమ ఆర్డరుతోపాటు అడ్వాన్సు పంపగలరు.

వలయువారు : బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలు.
బ్రాంచి :—నెం. 6, సుంకురామచెట్టి వీధి, మద్రాసు.

సుమధుర
సువాసనకలిగిన

# నీల

దర్బార్ వత్తి

NEEL DURBAR BATHI

అన్ని శుభ కార్యములలోను ఉపయోగించుటకు మిక్కిలి శ్రేష్ఠమైన సుగంధ వత్తులు

**డి. కృష్ణమూర్తి**

అగరబత్తి తయారుచేయువారు

706...... చిన్నపేట...... బెంగళూరు.2

---

# తండ్రి–కొడుకులు

రసవత్తరమైన కథ



పుస్తకరూపంలో దొరుకుతుంది

**వెల 8 అణాలు**



కావలసినవారు 8 అణాలు
మణియార్డరుద్వారా పంపాలి.

చందమామ పబ్లికేషన్స్

మదరాసు - 26.

---

"నా చర్మరక్షణకు
నిర్మలమైన సబ్బు అగత్యము!"

మైసూరు చందనసబ్బు యొక్క పరిమళ, ఓషధీగుణాలు బిడ్డ శరీరమును పూర్తిగా పరిశుభ్రము చేయుటయే గాక, లేతచర్మము చిట్లి బాధించకుండ చేయును.



"my skin needs a pure soap!"

# మైసూరు చందన సబ్బు

గవర్నమెంటు సోప్ ఫ్యాక్టరీ

బెంగుళూరు

(మెంబర్ ఐ. ఎస్. టి. ఎమ్. ఎ.)



డిశంబర్
17 నుండి

విశాలాంధ్ర
అన్నిముఖ్యకేంద్రములలో
ప్రదర్శింపబడుచున్న




దర్శకత్వము
వేదాంతం రాఘవయ్య
నిర్మాత
కె.గోపాలరావు






# మల్టీకలర్

## ఫొటో ఆఫ్‌సెట్ ప్రింటింగ్,
## ప్రోసెస్ బ్లాక్ తయారీలలో

అత్యున్నతస్థానాన్ని నిలబెట్టడమే ఎల్లప్పుడు
మా ముఖ్యాశయమని నమ్మకముగ చెబుతున్నాము



మన భారతదేశమందలి ఏ సంస్థయు ఇంతవరకు
ఎరుగని 30 అం. × 40 అంగుళముల బ్రహ్మాండ
మైన కెమెరాను, సరికొత్త ఆధునిక యంత్ర పరి
కరాలను నెలకొల్పి వున్నాము. నిపుణులు, అనుభ
వజ్ఞులు ఐన మా టెక్నీషియనులు, ఆర్టిస్టులు

మీ చిత్రములకు అచ్చు సరియైన
పోష్టర్లు తయారు చేయగలరు

---

# ప్రసాద్ ప్రోసెస్

చందమామ బిల్డింగ్స్, మదరాసు - 26

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

అనేక మండలాలతో, మండలాని కొక భాష గల విశాలదేశం మనది. ఏ ప్రాంతీయులకు ఆ ప్రాంతపు మాతృభాషలో చెప్పినప్పుడే విషయం మనసుకు ఎక్కుతుంది. ఈ ఆశయం నేరవేర్చడమే చందమామ సంకల్పం. ఇప్పటికి తన ఏడేళ్ళ ప్రాయంలోనూ చందమామ ఏడు ప్రధాన భాషలలో వెలిసి, ఎన్నో మండలాలను సేవిస్తూ ఉన్నది. ఈ సంచికతో ప్రారంభమయ్యే కొత్త సంవత్సరంలో మరికొన్ని భాషలలో వెలిసి, కథా సాహిత్యాన్ని కొత్త తీరులలో ఉజ్వలంగా ప్రచారం చేయటానికి చందమామ ఉద్యమిస్తుందని తెల్పటానికి ఎంతగానో సంతోషపడుతున్నాము. ఈ కొత్త సంవత్సరంలో మా పాఠకులకు, అభిమానులకు హృదయపూర్వకమైన అభివందనాలను సమర్పిస్తున్నాము.


జనవరి 1955

సంపుటి 16 సంచిక 1




# పిట్ట పోరు!

కామవర మను పట్టణమందున
కలడు భీమరాజు
వేయి ఏనుగుల బలము గలాడని
పేరు మోసినాడు.

భటసందోహము వెంట నడువగా
పయనం బయ్యాడు
"నూరు సింగముల ప్రాణంబులతో
పోరి తెత్తు" ననుచు—,

కోరమీసముల దిప్పు భీముని
దారిలోన గాంచి






"బలముంటే నను బట్టుకొమ్మని"
పలికె నొక్క చిలుక!
పిట్ట మాట వినకుండా నడిచే
భీముని జూపించి,
"నన్ను బట్టగా చేతగాని యీ
కున్ని భీమరాజు
కొడమ సింగముల బట్టబోదు నని
కోతలు గోశాడు"
అని రాచిలుక గలగల నవ్విన
విని యచ్చటి ప్రజలు
బలేరాజని పకపక నవ్విరి
బలుని భీము గాంచి!
భీమరాజుకు రోషం హెచ్చి
పిడికిలి బిగియించి





★ ★ ★

కొట్టకనే ఆ పిట్టను విడిచి
పెట్టినాడు రాజు !
కలకల నవ్వి పల్టీ కొట్టి
గగనంబున నిలిచి
"ఓడిపోతివా రాజా" నాకని
పాడె మొదటి పాట

బలము గలిగిన భీమరాజు తన
తెలివి లేమి దలచి
చిలుక తెలివికి చిలిపితనానికి
చిన్నగ నవ్వాడు !

చెట్టూ పుట్టా గుట్టలు తరిమి
పిట్టను పట్టుకొని—,
"ఏమనంటివే చిలకా నీకు
ఎందు కింత పొగరు ?"
అనగానే విని కిలకిల నవ్వి
అన్న దిట్లు చిలుక :
"కన్నారా ఈ రాజు బలమును
విన్నారా మీరు ?
పిట్టమీద బ్రహ్మాస్త్రము వేసే
భీముడు యీ రాజు
సింహబలు డని చిన్ని పిట్టను
సంహరించ బూనె"
పిట్ట మాట విని పాపం అంటూ
తిట్టగ ప్రజలంతా



# అట్టమీది బొమ్మ

పాండవులలో మధ్యముడైన అర్జునుడు యాత్రలనుండి ఇంకా తిరిగిరాలేదు. అర్జునుడు దగ్గరలేని చింతను ధర్మరాజాదులు పుణ్యకథాశ్రవణాలతోను, దివ్య స్థలాల సందర్శనంతోనూ గడపుతూ, కామ్యకవనంలో ఉంటున్నారు.

ఒకనాడు వారు కామ్యకవనంనుంచి చాలాదూరం వెళ్లారు. అక్కడ కొత్త కొత్త మునిజనుల పరిచయం కలిగింది. మైనాక, హిరణ్యశిరము మొదలైన పర్వతశిఖరాలు చూచారు. బిందుసరోవరతీరము మొదలైన దివ్య ప్రదేశాలలో ఆరురోజులు గడిపారు. ఏడవరోజు తెల్లవారుజామున ఎక్కడి నుంచో ఒక అపూర్వ పరిమళం వచ్చి పాండవులనూ, అక్కడ వున్న అందరినీ ఆకర్షించింది.

ఆ పరిమళానికి ద్రౌపది ఎక్కువగా ఆకర్షింపబడింది. ఆమె ఈ అద్భుత మైన పరిమళం ఆఘ్రాణించి చాలా కుతూహలపడింది. ఇది ఎక్కడనుండి వస్తున్నదా అని విస్తుపోయి నలుమూలలూ చూచేటంతలో ఈశాన్యదిక్కునుండి చాలాసుందరమైన ఒక ఎర్రటి పుష్పం గాలిలో తేలిఆడుతూ ద్రౌపదివైపే రాసాగింది. దానిని ద్రౌపది ఆప్యాయంతో అందుకొని, చేత పుచ్చుకున్నది.

ఇంత సుందరమైన పుష్పాన్ని ఇంతకుముందెన్నడూ ద్రౌపది చూచి ఎరుగదు. దీనినిగురించి వినిఐనా ఉండలేదు. ఈ పుష్పాన్నిగురించి ఆశ్రమాలలో వుండే ఋషులను అడిగిచూడగా, అది 'సౌగంధికపుష్ప'మని పేరుమాత్రం చెప్పారు. కాని, అది ఎక్కడ దొరుకుతుందో ఆ సంగతి తమకు తెలియదన్నారు.

ఇటువంటి పుష్పాలు ఇంకా కావాలని ద్రౌపది ఉవ్విళ్ళూరింది. ఈ పని నెరవేర్చడానికి ఒక్క భీమసేనుడే సమర్థుడని ఆమెకు బాగా తెలుసు. అందుచేత వెంటనే అతనివద్దకు వెళ్లి, తన కోరికను వెల్లడించింది.

ద్రౌపదిమీద భీమసేనుడికి అపారమైన ప్రేమ. కనుక, అతడు ఎంతో సంతోషంతో 'దీనికేముంది, ఇది ఈశాన్యదిక్కునుంచికదా వచ్చింది? దీని పరిమళంకూడా తెలుస్తూనేవుంది. పైగా, దీని పేరు ఫలానా 'సౌగంధికపుష్ప' మని ఋషులు చెప్పనేచెప్పారు. ఇంతకుమించిన ఆనవాళ్ళు ఏం కావాలె! ఇప్పుడే పోయి నీకు కావలసినన్ని పువ్వులు తెచ్చిపెడతాను' అని చెప్పి అతడు ఈశాన్యదిశకు బయల్దేరాడు.




# పద్మావతీ పరిణయం

పంచపాండవుల సంతతివాడైన వత్సదేశపు రాజు ఉదయనుడు తన మంత్రి అయిన యౌగంధరాయణుడి సహాయంతో ఉజ్జయినీ రాజకుమార్తె వాసవదత్తాదేవిని పెళ్ళి చేసుకొన్నాడు. వాసవదత్త అపురూపలావణ్యవతి. వత్సరాజుకు రాజకార్యాలలో ఆసక్తి లేదు. మొదటినుంచీ అతనికి సంగీతమందూ, వేటయందూ మక్కువ జాస్తి. ఇప్పుడు వాసవదత్తాదేవి అతని మనస్సును పూర్తిగా ఆక్రమించింది. అందుచేత రాజు రాజ్యభారమంతా మంత్రి అయిన యౌగంధరాయణుడిపైనా, సేనాపతి అయిన రుమణ్వంతుడిపైనా వేసి, వాసవదత్తాదేవిని వెంట వుంచుకొని వేటలోనూ, విలాసాలలోనూ మునిగితేలసాగాడు.

ఒకప్పుడు చంద్రవంశపు రాజులు హస్తినాపురం రాజధానిగా పెట్టుకొని భారతదేశమంతా ఏలారు. కాని ఉదయనుడి కాలానికి సామ్రాజ్యమంతా పోయి వత్సదేశం మాత్రమే మిగిలింది. రాజును భోగలాలసతనుంచి మరల్చకపోయినట్టయితే ఈ ఉన్నదికూడా ఊడిపోతుందని యౌగంధరాయణుడు భయపడ్డాడు. ఆయన ఒక రాత్రి రుమణ్వంతుణ్ణి తన యింటికి భోజనానికి పిలిచి కర్తవ్యంగురించి చర్చించాడు.

యౌగంధరాయణుడు అంతకుపూర్వమే ఒక ఆలోచనచేశాడు. అదేమంటే, ఉదయనుడి శత్రువర్గానికి చెందినవారిలో ఒకడు మగధరాజు ప్రద్యోతుడు. మగధరాజ్యం వత్సరాజ్యాన్ని అనుకొనివున్నది. ప్రద్యోతుణ్ణి ఏవిధంగానైనా కూడదీసినట్టయితే ఉదయనుడు సామ్రాజ్యం సంపాదించటానికి వీలు ఏర్పడుతుంది. ప్రద్యోతుడికి పద్మావతి అనే కుమార్తె వున్నది. ఆమె చక్కని చుక్క, లక్షణవతి. ఆమెను ఎలాగయినా ఉదయనుడికి వివాహం చేసి

ఎస్. సీతారామరావు



నట్టయితే పని కొనసాగుతుందని యౌగంధ రాయణుడు ఆలోచించాడు.

"మీ కుమార్తెను మా రాజు కిచ్చి చేయండి," అని యౌగంధరాయణుడు మగధరాజుకు కబురు పంపాడుకూడా. కాని మగధరాజు ఒప్పుకోలేదు. "వాసవ దత్తాదేవి తప్ప మరే చింతా లేని ఉదయ నుడికి నా కుమార్తెను యెలా వివాహం చెయ్యను?" అని ఆయన ఎదురుప్రశ్న వేశాడు. వాసవదత్త తనచెంత వుండగా ఉదయనుడు మరొకతెను పెళ్లాడడు. అతడికి రాజ్యలాభం కలగాలంటే ఉదయ నుడినుంచి వాసవదత్తను వేరుచేసి తీరాలి.

దానికికూడా ఒక వుపాయం ఆలోచిం చాడు యౌగంధరాయణుడు. రాజు దూరంగా వున్న సమయంలో వాసవదత్త చనిపోయినట్టు సాక్ష్యం సృష్టించి ఉదయ నుణ్ణి పద్మావతితో వివాహానికి ఒప్పించాలి. వివాహం అయేదాకా వాసవదత్తను ఎక్క డైనా దాచివుంచాలి.

ఈ వుపాయం విని రుమణ్వంతుడు నివ్వెరపోయాడు.

"వాసవదత్త చనిపోయిందంటే ఉదయ నుడు మతిభ్రష్టుడు కావచ్చు, మర ణించనూవచ్చు. పైగా ఈ ఆలోచనకు వాసవదత్తాదేవి అంగీకరించాలి. ఆమె అన్న గారైన గోపాలకుడికికూడా నిజం తెలిపి వుంచటం మంచిది," అని సలహా ఇచ్చాడు రుమణ్వంతుడు.

ఎవరికీ ఏ ఆపదా రాకుండానే గ్రంథం నడిపిస్తానని అభయమిచ్చి యౌగంధరాయ ణుడు ఉపక్రమించాడు. గోపాలకుణ్ణి పిలి పించి అతనితో రహస్యంగా అంతా చెప్పి ముందుగానే ఒప్పించారు. మర్నాడు యౌగంధరాయణుడు ఉదయనుడివద్దకు పోయి, "దేవా, మనం లావాణకం పోదాం. అది మన రాజ్యానికి పొలిమేర. చాలా సుందరమైన ప్రదేశం. అద్భుతమైన వేట



భూములున్నాయి. అదీగాక అక్కడి ప్రజలను మగధరాజు పీడిస్తున్నాడట. వెళ్ళి విచారించటం మన ధర్మం," అన్నాడు.

ఉదయనుడు వాసవదత్తతోనూ, గోపాలకుడితోనూ పరివారంతోనూ లావాణకానికి బయలుదేరాడు. యౌగంధరాయణుడూ, వసంతుకుడు మొదలైనవారుకూడా వెంట వెళ్ళారు. అక్కడికి పోయినది మొదలు ఉదయనుడు వేటపిచ్చిలో పడిపోయాడు.

ఒకనాడు రాజు చాలా దూరాన గల వేట భూమికి వెళ్లిఉన్న సమయంలో యౌగంధరాయణుడు వాసవదత్తవద్దకు వెళ్ళి తన పన్నాగం ఆమెకు వెల్లడించాడు. తాను చనిపోయినట్టు నటించి రాజుకు బాధ కలిగించటమూ, కొంతకాలం వియోగం అనుభవించటమూ వాసవదత్తకు దుర్భరంగా తోచింది. అయినప్పటికీ యౌగంధరాయణుడిపై గల గురుభావంచేతా, తన భర్తకు సామ్రాజ్యప్రాప్తి కలుగుతుందనే నమ్మకంచేతా వాసవదత్త యౌగంధరాయణుడు చెప్పినదానికి ఒప్పుకున్నది.

యౌగంధరాయణుడు వాసవదత్తచేత బ్రాహ్మణ స్త్రీ వేషం ధరింపజేశాడు, వాసంతకుణ్ణి ఒంటి కన్నుగల బ్రహ్మచారిగా తయారుచేశాడు, తానొక ముసలి బ్రాహ్మణ



రూపం ధరించాడు. ముగ్గురూ బయలుదేరి పొలిమేర దాటి మగధకు ప్రయాణమయారు. వారు వెళ్ళగానే రుమణ్వంతుడు వాసవదత్త ఉండే ఇంటికి నిప్పుపెట్టాడు. నలుగురూ చేరేసరికి ఇల్లు పూర్తిగా కాలిపోయింది. వాసవదత్తాదేవీ, వసంతకుడూ అందులో కాలిపోయారని రుమణ్వంతుడు దుఃఖంతో చెప్పాడు. అందరూ శోకాలు పెట్టారు. ఆరోజుకు వేట ముగించుకుని బసకు వస్తూనే ఉదయను డీ దుర్వార్త విని, స్పృహతప్పి పడిపోయాడు. తిరిగి స్మారకం వచ్చాక ఉదయనుడు తన ప్రియభార్య కోసం ఎంతగా దుఃఖించి ఉంటాడో



తెలియదుగాని, వాసవదత్త సోదరుడైన గోపాలకుడు తన చెల్లెలి మరణవార్తకు కొద్దిపాటి విచారమే కనబరచటంచేత ఉదయనుడు తన దుఃఖాన్ని అణుచుకో వలిసినవాడయినాడు.

ఈలోపుగా మారువేషాలలో ఉన్న యౌగంధరాయణుడూ, వాసవదత్తా, వసంతకుడూ రాజోద్యానవనం చేరి అక్కడ ఉన్న రాజకుమారి పద్మావతిని కలుసుకున్నారు.

ఆమెతో యౌగంధరాయణుడు ఈ విధంగా చెప్పాడు:

"అమ్మా, ఈమె నాకుమార్తె, అవంతిక. దీని భర్త దురలవాట్లకు లోనై దీనిని విడిచిపెట్టి దేశాలమీద పోయాడు. నేను వాణ్ణి వెతికి తెచ్చేదాకా దీనిని నీవద్ద ఉంచుకొని పుణ్యం కట్టుకో. నా కుమారుడుకూడా దాని వద్దనే తోడుగా ఉంటాడు."

అసలే దుఃఖితురాలైవున్న వాసవదత్తను, ఆమె సౌందర్యాన్ని చూడగానే పద్మావతి హృదయం కరిగిపోయింది.

ఆమెను తనవద్ద ఉంచుకొనటానికి పద్మావతి ఒప్పుకున్నది. కార్యం సానుకూలమై యౌగంధరాయణుడు వెళ్లిపోయాడు.

వాసవదత్త వసంతకుడితోబాటు పద్మావతి వెంట అంతఃపురానికి వెళ్లింది. ఆమె మనసు అప్పుడే తన భర్తకొరకు తపించసాగింది. కాని ఆమె అంతఃపురంలో సీతాదేవి చిత్రువుచూసి, "ఆ మహాతల్లి వియోగం ముందు నాదెంత?" అని మనసును నిగ్రహించుకున్నది.

కొద్ది రోజులు గడిచాక యౌగంధరాయణుడు మగధరాజుకు కబురు చేశాడు.

"లావాణకమందు వాసవదత్తాదేవిని పోగొట్టుకున్నది మొదలు మా రాజు శోకసముద్రంలో మునిగి ఉన్నాడు. అయన శోకాన్ని తొలగించగలందులకు మీ కుమార్తెను పద్మావతీదేవిని మా రాజుకిచ్చి పాణిగ్రహణం చేయించండి."





ఈసారి మగధరాజు అంగీకరించాడు. ఉదయనుడు తన అల్లుడవుతాడని గర్వించాడుకూడా. వారంరోజులలో శుభ ముహూర్తం ఏర్పాటుచేశారు.

ఈ వార్త వినగానే పద్మావతి ఆనందానికీ, వాసవదత్త దుఃఖానికీ మేరలేదు.

"దేవీ, విచారించకు, ఈ వివాహంతో శత్రువు మిత్రుడౌతున్నాడు. ఇక మహారాజుమాటంటావా? నీపై ఆయన ప్రేమ ఎన్నటికీ మారదు," అని వసంతకుడు వాసవదత్తను ఊరడించాడు.

సరిగా ముహూర్తానికి ఉదయనుడు సపరివారంగా వచ్చిచేరాడు. మహావైభవంగా వివాహం జరిగిపోయింది. అగ్నిసాక్షిగా ఉదయనుడు పద్మావతిని వివాహమాడే సమయంలోనే, యౌగంధరాయణుడు మగధరాజుచేత వత్సదేశపు రాజుకు శాశ్వతమైత్రి ప్రమాణంకూడా చేయించాడు.

రాజగృహమంతా కళకళలాడుతూ, సందడిగా, వైభవంగా, ఆనందసముద్రంలో తేలిఆడుతూంటే వాసవదత్తాదేవి, ఏమూలో దాగిఉండి వివాహం నిర్విఘ్నంగా కొనసాగనిచ్చింది.

పెళ్ళి పూర్తికాగానే ఉదయనుడు తన నూతన వధువుతో లావాణకానికి తిరిగివచ్చేశాడు. పద్మావతి పరివారంతోబాటు అందరికీ వెనుకగా వాసవదత్తకూడా వచ్చేసింది.

వత్సరాజయిన ఉదయనుడు పద్మావతిని పెళ్లాడాడేగాని అతను వాసవదత్తను ఒక్క క్షణమైనా మరవలేదు. భర్తయొక్క మనస్థితి ఊహించినదై వాసవదత్త పద్మావతికి తనలాగే పూలుముడిచి, తిలకందిద్ది భర్తవద్దకు పంపి, తాను తన అన్నగారైన గోపాలకుడుండే విడిదికి పోయింది. అన్నాచెల్లెళ్ళు ఒకరినొకరు కౌగిలించుకొని దుఃఖించారు. ఆ సమయంలో అక్కడికి వచ్చిన యౌగంధరాయణ రుమణ్వంతులు మొదలుకొని అందరి కళ్లూ చెమ్మగిల్లాయి.



ఇక్కడ రాజు శయనమందిరంలో తన కొత్తభార్య ధరించిన పూలూ, తిలకమూ చూసి నివ్వెరపోయాడు.

"నీకీ అలంకరణ ఎవరు చేశారు?" అని ప్రశ్నించాడు ఉదయనుడు.

పద్మావతి ఆశ్చర్యపడుతూ జరిగిన సంగతి వివరించింది:

"ఒక వృద్ధబ్రాహ్మణుడు అవంతిక అనే కుమార్తెను నావద్ద రక్షణకు ఉంచాడు. ఆమె చాలా నేర్పుగలది. ఆమె స్వయంగా ఇవాళ నాకీ అలంకరణ చేసింది."

"ఆమె ఎక్కడఉన్నది?" అన్నాడురాజు.

పద్మావతి తన చెలికత్తెలను పిలిచి అవంతికను పంపమనేసరికి, "ఆమె ఇక్కడ లేదమ్మా. గోపాలమహారాజుగారి విడిదికి వెళ్ళింది" అన్నారు చెలికత్తెలు.

"అక్కడి కెందుకు వెళ్ళిందే? వెళ్ళి, వేగిరం నేను రమ్మంటున్నానని పిలుచుకు రండి!" అని ఆజ్ఞాపించింది పద్మావతి.

ఈ అవంతిక గోపాలకుడి విడిదికి వెళ్లిందనేసరికి ఉదయనుడి సందేహం మరింత ఎక్కువయింది. అతను గోపాలకుడి ఇంటికి వెళ్ళి వాసవదత్తను చూశాడు. అతని ఆనందానికి అంతులేదు.

యౌగంధరాయణుడు రాజుకు క్షమాపణ చెప్పుకుంటూ, "దేవా, ఇదంతా నా కల్పనే. మీకు సామ్రాజ్యం సంపాదించిపెట్టాలనే ఉద్దేశంతో మగధరాజ్యంతో సఖ్యం కలపటానికి ఈ వివాహం జరిపించాను" అన్నాడు.

"అలా అనకండి. నేను రాజ్యభారాన్ని తోసుకుతిరిగినప్పటికీ దానివల్ల నష్టం కలగకుండా నన్ను మీరు కనిపెట్టి ఉన్నందుకు కృతజ్ఞుణ్ణి," అన్నాడు వత్సరాజు.

వాసవదత్త దొరికినతరవాత వత్సరాజు ఉదయనుడికి పద్మావతీదేవియొక్క ఔదార్యం అర్థమయింది. అతను ఇద్దరు భార్యలనూ సమంగా ప్రేమిస్తూ మితిలేని ఆనందం పొందాడు.






# మతి లేని సాక్ష్యం

ఒక వ్యాపారి వ్యాపారంనిమిత్తం దూర దేశానికి పోతూ పొద్దూకేవేళకు ఒక గ్రామం చేరుకున్నాడు. ఆ రాత్రి ఆ గ్రామంలోనే గడుపుదామని నిశ్చయించి వ్యాపారి తన గుర్రాన్ని గ్రామంకేసి నడిపిస్తూ ఉండగా దారిలో ఒక మనిషి ఎదురువచ్చి, "అయ్యా, నాలుగు అణాలిప్పించండి. నాకు నల్ల మందు అలవాటుంది. రెండు రోజుల నుంచీ దగ్గిర కానీకూడా లేక చాలా బాధ పడుతున్నాను," అన్నాడు.

వాడికి నాలుగణాలిచ్చి పంపేసి వ్యాపారి ఊళ్ళోకి వెళ్లాడు. ఒక యింటిముందు గుర్రం దిగి, యింటియజమానిని ఆ రాత్రికి అక్కడ పడుకోనివ్వమన్నాడు. ఇంటి యజమాని ఒప్పుకున్నాడు.

వ్యాపారి తన గుర్రాన్ని ఇంటి బయట వున్న కట్టుకొయ్యకు కట్టేసి ఆ రాత్రి ఆ యింటనే పడుకున్నాడు.

వ్యాపారి తెల్లవారి లేచి తిరిగి ప్రయాణం సాగింతామని బయటికి వచ్చేసరికి, అతని గుర్రాన్ని ఇంటి యజమాని ఎక్కడికో తోలుకు పోబోతున్నాడు.

"అయ్యా, నేను వెళ్లిపోబోతున్నాను. దయచేసి నా గుర్రాన్ని ఎటూ తీసుకు పోకండి," అని వ్యాపారి హెచ్చరించాడు.

ఇంటి యజమాని ఆశ్చర్యంతో, "ఇది నాగుర్రం. నా ఇంటిముందున్న కట్టుకొయ్య రోజుకొక గుర్రాన్ని పెడుతుంది," అన్నాడు.

"అయ్యా, నా గుర్రాన్ని హరించటానికి యత్నిస్తున్నారు. ఇది న్యాయం కాదు," అన్నాడు వ్యాపారి.

"నామాట నమ్మకం లేకపోతే, ఈ ఊళ్ళో ఎవరినన్నా అడుగు. మా యింటి కట్టుకొయ్య రోజు కొక గుర్రాన్ని పెడుతుందని అందరికీ తెలుసు," అన్నాడు ఇంటి యజమాని.

టి. నాగరాజు

ఆ మనిషి పచ్చి దొంగ. ఆ వూళ్ళోచాలా మంది అతనిలాటివాళ్ళే. తెలియక పొరుగూరివాడు వస్తే అందరూ కలిసి మోసం చేస్తూ ఉంటారు. అందుచేత, అందరూ ఆ యజమాని చెప్పినదాన్నే బలపరిచారు.

ఇక చేసేదిలేక వ్యాపారి గ్రామాధికారి వద్దకు పోయి ఇంటి యజమానిపై ఫిర్యాదు చేశాడు. గ్రామాధికారి ఇంటియజమానిని పిలిపించి అడిగాడు.

"చిత్తం, మాయింటి కట్టుకొయ్య రోజు కొక గుర్రాన్ని పెడుతుందండి. కావలిస్తే బోలెడుమందిచేత సాక్ష్యం ఇప్పించగలను," అన్నాడు ఇంటి యజమాని.

"ఏమయ్యా? ఈ గుర్రం నీదేనని నీకెవరైనా సాక్షులున్నారా? ఉంటే తెచ్చుకో!" అన్నాడు గ్రామాధికారి వ్యాపారితో.

కిందటి సాయంకాలం నల్లమందుకోసం తనవద్ద నాలుగణాలు పుచ్చుకొన్న మనిషి సంగతి జ్ఞాపకంవచ్చి వ్యాపారి అతన్ని వెతుక్కుంటూ వెళ్లాడు. ఈలోగా ఇంటి యజమానికూడా తనవైపు సాక్ష్యం చెప్పేవారిని తీసుకురావటానికి వెళ్లాడు.

వ్యాపారిదగ్గిర నాలుగణాలు పుచ్చుకున్న మనిషి నల్లమందుమత్తులోనే ఉన్నాడు. వ్యాపారి ఆ నల్లమందుభాయీని కష్టపడి



లేపి తనకు జరిగిన అన్యాయాన్ని గురించి చెప్పాడు. అది వినగానే ఆ నల్లమందు భాయి వ్యాపారివెంట న్యాయాధికారి వున్న చోటుకు వచ్చాడు.

అప్పటికే ఇంటి యజమాని తన సాక్షులను తెచ్చి గ్రామాధికారి ఎదటపెట్టి, తన యింటి కట్టుకొయ్య రోజుకొక గుర్రాన్ని పెడుతుందని సాక్ష్యం చెప్పిస్తున్నాడు. నల్లమందు భాయిని చూడగానే ఇంటి యజమాని సాక్షులు బిగ్గిరిగా నవ్వి, "వెతికి వెతికి ఈ నల్లమందుభాయినా సాక్ష్యం తెచ్చావు? వీడి మాట ఎవరు నమ్ముతారు?" అని వ్యాపారిని చూసి గేలిచేశారు.

మత్తు పూర్తిగా పోక ఆవలిస్తున్న నల్లమందు భాయిని చూసి గ్రామాధికారికూడా "ఏమయ్యా, బాగా నల్లమందు మత్తులో ఉన్నట్టున్నావు. అలాంటి నీసాక్ష్యం ఎలా ఆమోదించేది?" అన్నాడు.

దానికి నల్లమందుభాయి తడుముకోకుండా, "అయ్యా, నేను మత్తులో లేను. రాత్రల్లా చెరువు అడుగున మంటచేసి చెరువులో చేపల్ని ఉడకపెట్టాను. కన్ను మూస్తే ఒట్టు. అందుచేత నిద్రమత్తుగా వుంది. అంతే!" అన్నాడు.

ఈ మాటకు అందరితోబాటు గ్రామాధికారికూడా నవ్వి "నీది మతిలేని సాక్ష్యమని నీ మాటలే రుజువు చేస్తున్నాయి. చెరువుకింద ఎవరన్నా మంట చేస్తారా?" అని అడిగాడు.

"అదేమిటండీ? కట్టుకొయ్యలు గుర్రాల నీనగా లేందీ, చెరువుకింద మంట బెట్టటం అబ్బురమా? నాదా మతిలేని సాక్ష్యం?" అని అడిగాడు నల్లమందుభాయి.

ఈ మాటకు గ్రామాధికారి సిగ్గుపడి, వ్యాపారి గుర్రాన్ని వ్యాపారికిప్పించి, ఇంటి యజమానిని గట్టిగా హెచ్చరించాడు.





# కాకిఅరుపుకుకారణం

భోజరాజు సాహిత్యప్రియుడు. కవి పండితులను ఘనంగా బహూకరించేవాడు. తనకు నచ్చేలాగు కవిత్వం చెబితే అక్షర లక్ష లిచ్చేవాడు. అందుచేత అతని రాజ్యంలో దాదాపు అందరూ కవులే, చిన్న పిల్లలు సయితం పండితులే.

అనాదిగా కాశీపండితులకు దేశమంతటా గొప్ప ఖ్యాతి ఉండేది. కాని భోజరాజు పరిపాలనలో ధారానగరపు పండితుల ఖ్యాతి పైకి వచ్చింది. రానురాను దేశంలో కాశీపండితులను తలుచుకునేవారే లేకుండాపోయారు.

ఇది చూసి కాశీపండితులకు కోపం వచ్చింది. వారంతా కలిసి ఒక సభచేశారు. కాశీపండితులు కొందరు ధారానగరానికి వెళ్ళి అక్కడి పండితులను బహిరంగ చర్చలో ఓడిస్తేనేగాని కాశీనగర ప్రతిష్ఠ నిలవదని సభలో తీర్మానించారు. ఇందుకుగాను నలుగురు దిగ్గజాలవంటి కాశీ పండితులను ఎన్నుకొని, వారిని ధారానగరానికి ప్రయాణం కట్టించారు.

ఈ నలుగురు కాశీపండితులూ ధారానగరం చేరుకొని ఒక సామాన్య గృహస్థు యింట బస చేశారు.

ఆ గృహస్థు వారిని గౌరవంతో ఆదరించి వారికి తన శక్తికొద్దీ సమస్త సౌకర్యాలూ ఏర్పాటుచేశాడు. గృహస్థుకు పన్నెండేళ్ళ కూతురూ, ఎనిమిదేళ్ళ కొడుకూ ఉన్నారు.

ధారానగరంలో అందరికీ పండితులపట్ల గౌరవం ఉన్నట్టే కనబడింది. కాని ఇక్కడి పండితులు ఎంత గట్టివారో, వారిని ఎలా ఓడించాలో, తీరా వారి చేతులో ఓడిపోతే తమకే గాక కాశీనగరానికే అపఖ్యాతి వస్తుందని వారు భయపడుతూనే ఉన్నారు.

పండితులు మరునాటి ఉదయం వేకువ జామునే లేచి నిత్యకృత్యాలు తీర్చు

బి. వేణుగోపాలరావు

కుంటున్న సమయంలో ఒక చిత్రం జరిగింది. చెట్లమీది కాకులు కోలాహలంగా అరుస్తున్నాయి.

ఈ అరుపులు విన్న ఇంటివారి కుర్రవాడు తన అక్కను, "అక్కా, అరుణోదయం వేళ కాకులెందుకు అరుస్తాయే?" అని అడిగాడు. నీళ్ళు తేవడానికి ఆ పిల్ల బిందె చంకన పెట్టుకొని బావివద్దకు పోతూ, "మన యింట నలుగురు కాశీపండితులున్నారు. ఇంత చిన్న అనుమానాన్ని వారు తీర్చలేక పోరులే. వారినడుగు," అని వెళ్లిపోయింది.

కుర్రవాడు పండితులదగ్గిరికి వచ్చి, "అయ్యలారా, యీ సందేహన్ని తీర్చండి. తెల్లవారబోతూండగా కాకులెందుకు అరుస్తాయి?" అని సవినయంగా అడిగాడు.

కాశీపండితులు ఒకరి ముఖాలొకరు చూసుకొన్నారు. నిజానికి, కాకులు పొద్దున్నే ఎందుకు అరుస్తాయో వారికి తెలియదు. వారికలాటి సందేహం ఎన్నడూ కలగలేదు. ఆ సందేహానికి సమాధానం ఉంటుందని కూడా వారికి తోచలేదు.

కుర్రవాడికి ఏదో సమాధానం చెప్పాలి గనక వారు తమకు తోచినది చెప్పారు.

"ప్రొద్దునే లేచి కాకులు ఒకదాన్ని ఒకటి పలకరించుకుంటాయి," అన్నాడొక పండితుడు.



"రోజల్లా పలకరించుకుంటూనే ఉంటాయి. ఉదయాన అన్నీ ఒక్కసారిగా ఎందుకరుస్తాయి?" అని అడిగాడు కుర్రవాడు.

"రాత్రి అయిపోయింది గనక సంతోషంగా అరుస్తాయి," అన్నా డింకొక పండితుడు.

"రోజల్లా అరవవేం?" అన్నాడు కుర్రవాడు.

మిగిలిన పండితులుకూడా ఏదోచెప్పారు. కాని కుర్రవాడికి తృప్తి కలగలేదు.

ఇంతలో కుర్రవాడి అక్క నీళ్ళబిందెతో తిరిగివచ్చింది.

"అక్కా, నా సందేహం నీవైనా తీరుద్దూ! తెల్లవారేటప్పుడు కాకులన్నీ ఎందుకలా గోలగా అరుస్తాయి?" అని కుర్రవాడు మళ్ళీ అడిగాడు.

"కాశీపండితులను అడగమని చెప్పాను గదా? అడక్కపోయావా?" అన్నది అక్క.

"వారికీ సరిగా తెలిసినట్టు లేదక్కా," అన్నాడు తమ్ముడు.

"అయితే నేను చెబుతాను విను: సూర్యభగవానుడు చీకటిని నిర్మూలిస్తూ రావటం చూసి, నల్లగా వున్న తమనుకూడా చీకటిగా భావించి నిర్మూలించి పోతాడేమో నని కాకులు, 'మేము చీకటి కాము: కాకులము, కాకులము! కావు! కావు!' అని సూర్యభగవానుణ్ణి హెచ్చరిస్తున్నాయి," అంటూ అక్క లోపలికి వెళ్ళిపోయింది.

తన సందేహం తీరినందుకు కుర్రవాడు పరమానందంతో గంతులు వేయసాగాడు.

ఇదంతా వింటున్న కాశీపండితులు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"ఇంకా పెళ్ళి అయినాకాని, సామాన్య గృహస్థు కూతురికే ఇంత ప్రజ్ఞఉంటే, ఇక ఈ దేశపు పండితుల ముందు మనమెంత?" అని వారిలో వారు వితర్కించుకొని అప్పటికప్పుడే కాశీనగరానికి ప్రయాణం కట్టి వెళ్ళిపోయారు.





## 13

[గుహలో దాగివున్న సమరసేనుణ్ణి, వ్యాఘ్రదత్తుడి భటులు బంధించారుకదా? తరవాత అతణ్ణి వ్యాఘ్రదత్తుడు, శాక్తేయుడినిగురించీ, అతడి త్రిశూలాన్ని గురించీ ప్రశ్నించాడు. వాటి సంగతి తెలియదని చెప్పిన సమరసేనుణ్ణి చంప నిశ్చయించాడు. కాని ఆరాత్రి ఇద్దరు కొత్తవాళ్లు వచ్చి సమరసేనుణ్ణి చెరనుంచి విడిపించి తీసుకుపోయారు. తరవాత—]

సమరసేనుడూ, అతణ్ణి చెరనుంచి విడిపించిన ఇద్దరు సైనికులూ పల్లెచేరేసరికి అక్కడి పరిస్థితి గందరగోళంగా వుంది. విచ్చుకత్తులు ధరించిన వ్యాఘ్రదత్తుడి భటులు పల్లెలోని ఇళ్ళనన్నిటినీ గాలిస్తున్నారు. చాలామంది పల్లెవాసులు భయంతో పక్కనవున్న కొండలకేసీ, అడవులకేసీ పారిపోతున్నారు.

"శివదత్తుడెక్కడ, శివదత్తుడెక్కడ?" అని అరుస్తూ, సైనికులు తమకు దొరికిన వారిని ప్రశ్నిస్తున్నారు. 'మాకు తెలియదు?' అన్న జవాబు వినగానే మండిపడి వారిని నానా హింసా పెడుతున్నారు.

కొంతదూరాన వుండగానే సమరసేనుడికీ, అతడి వెంటవున్న వారికీ ఈ భయంకర దృశ్యం కంటబడింది. వారు సరాసరి పల్లెకుపోక, అక్కడవున్న చెట్ల చాటున దాక్కుని యీ పరిస్థితి అంతా గమనించసాగారు. 'శివదత్తుడెవరు?' అన్న అనుమానం కలిగింది సమరసేనుడికి.

"ఈ శివదత్తుడెవరు? అతడికోసం పల్లెవాసుల్ని బాధిస్తున్న యీ సైనికులెవరు?"




అని సమరసేనుడు తన వెంటవున్న సైనికులను ప్రశ్నించాడు.

అందుకు సైనికులలో ఒకడు, "ఈ శివదత్తుడు మా నాయకుడు. మిమ్ములను ఆయన ఆజ్ఞవల్లనే ఖైదునుంచి విడిపించి తీసుకువస్తున్నాం. పల్లెనంతా భీభత్స పరుస్తున్న వాళ్ళు వ్యాఘ్రదత్తుడి సైనికులు," అని జవాబుచెప్పాడు.

ఈ జవాబు సమరసేనుడికేమీ సంతృప్తి కలిగించలేదు. శివదత్తుడు తననుంచి ఎలాంటి సహాయం అపేక్షించి; చెరనుంచి విడిపించాడో అన్న అనుమానం అలాగే వుంది. శివదత్తుడికీ, వ్యాఘ్రదత్తుడికీ వున్న



వైరుధ్యానికి కారణాలేమిటో సమరసేనుడికి అవగాహన కాలేదు.

"అయితే ఇప్పుడు మనం చేయవలసిందేమిటి?" అని అడిగాడు సమరసేనుడు.

అతడి వెంటవున్న యిద్దరు సైనికులూ మొఖమొఖాలు చూచుకొన్నారు. వాళ్ళ ధోరణిచూస్తే, ముందు కర్తవ్యమేమిటో వాళ్లు నిర్ణయించుకోలేక పోతూన్నట్టు తెలుస్తూవుంది.

"శివదత్తుడు మిమ్మల్ని యిక్కడకు తీసుకురమ్మన్నాడు. ఆయన మీతో స్నేహం చేయదలిచే యీపనికి మమ్మల్ని నియమించాడు. కాని, ఆయన వుంటూన్న పల్లె రహస్యం వ్యాఘ్రదత్తుడికి తెలిసిపోయింది. అందుకే అతడి సైనికులు పల్లెనంతా గాలిస్తున్నారు. శివదత్తుడు ముందుగానే ప్రమాదం గ్రహించి ఎటైనా పారిపోయి వుంటాడు," అన్నారు సైనికులు.

శివదత్తుడు అలా పారిపోవటం ఎటుకేసి పారిపోయాడో తెలిస్తేతప్ప, లేకపోతే తాము ప్రమాదంలో చిక్కుకోగలమని సైనికులూ, సమరసేనుడుకూడా గ్రహించారు. ఈ పరిస్థితుల్లో తాము ఏమిచేయుటమా అని ఆలోచించేటంతలో వారికి వెనుకనుంచి ఒక సన్నని ఈల వినబడింది. వెంటనే వాళ్ళు





ముగ్గురు అటుకేసి చూశారు. దూరంగా చెట్టు కొమ్మమీద నక్కివున్న ఒక వ్యక్తి వాళ్లకేసి చేతులు ఊపుతూ పిలుస్తున్నాడు.

పిలుస్తూన్న ఆ మనిషి మిత్రుడో, శత్రువో అన్న సందేహం సమరసేనుడికి కలిగింది. కాని తను యీ ప్రాంతానికి కొత్త, తన వెంట వున్నవాళ్ళిద్దరూ ఎలా నడుచుకో మంటే అలా నడుచుకోవటంతప్ప తనకు మార్గాంతరం లేదనుకున్నాడు.

సమరసేనుడివెంట వున్న సైనికులలో ఒకడు పెదాలు బిగించి తిరిగీ ఈలవేశాడు. అందుకు జవాబుగా చెట్లల్లో దాగివున్న వాడు రెండుమార్లు ఈలవేశాడు.

"అతడు మనకు మిత్రుడే. రహస్య సంకేతం గ్రహించాడు. అది ఒక శివదత్తుడి అనుచరులకు తప్ప మరొకరికి తెలియదు. రండి, పోదాం," అన్నాడు సైనికుడు.

సమరసేనుడూ, సైనికులూ తాము దాక్కున్న ప్రదేశంనుంచి ఆ నూతన వ్యక్తి కూర్చునివున్న చెట్టుదగ్గరకు వెళ్లారు.

వీళ్లు ముగ్గురూ చెట్టుదగ్గరకు రాగానే ఆ కొత్తవాడు చెట్టు దిగి వచ్చాడు. గందరగోళంగావున్న పల్లెకేసి ఒకమారు చూచి:

"మీకోసమే నన్ను శివదత్తుడు యిక్కడ కావలివుంచాడు. ఇవ్వాళ వేకువజామునే వ్యాఘ్రదత్తుడి సైనికులు గ్రామాన్ని ముట్ట





నీకు తెలుసా? మాకు మార్గం చూపించ గలవా?'' అని అడిగాడు ఒకసైనికుడు.

అందుకు ఆ నూతన వ్యక్తి "అయన ఎక్కడ వుండేదీ నాకు తెలియబరచలేదు. కాని ఈ పటంవున్న కాయితం నా చేతి కిచ్చాడు. ఇందులో అయన ఎక్కడ వుండేదీ గుర్తుపెట్టానని చెప్పాడు. మీరే చూడటం మంచిది, ఈ పటం నా కర్థం కావటంలేదు,'' అంటూ చుట్టగా చుట్టి వున్న ఒక కాయితాన్ని దుస్తులలోనుంచి తీసి సమరసేనుడికి యిచ్చాడు.

సమరసేనుడు ఆ కాయితాన్ని విప్పి పరీక్షించిచూశాడు. అందులో కొండల్లో పాడుపడినట్టున్న కొన్ని గృహాలూ, బావులూ, కొలనులూ చిత్రించబడివున్నాయి. ప్రతి చిత్రంకిందా, దాని పేరుకూడా స్పష్టంగా లిఖించబడివుంది. కాని శివదత్తుడు ఎక్కడ దాక్కునివున్నాడో మాత్రం తెలుసు కునేందుకు అందులో ఏ విధమైన గుర్తులూ లేవు.

"శివదత్తుడు కొండల్లో పాడుపడివున్న ఈ గృహాలకేసి పారిపోయాడు. ప్రమాదంలో చిక్కుకున్న అతడు ఇలాంటి చోటుకు పోవటంలో వున్న అర్థమేమిటో నాకు తెలి యడంలేదు. కారణం ఏదయినా మనం

డించారు. ఆ సంగతి ముందుగానే వేగుల వల్ల శివదత్తుడు గ్రహించి అనుచరులతో పారిపోయాడు. నేను మీకోసం నిరీక్షిస్తు న్నాను" అని చెప్పాడు.

అతడి మాటలు విన్నతరవాత అందరికీ ప్రాణం తెప్పరిల్లినట్టయింది. కాని, శివ దత్తుడు ఎక్కడికి పోయాడు? అతణ్ణి కలుసుకోవటం ఎలా? అన్నదే ముఖ్య సమస్యగా తోచింది.

"ఈయన సమరసేనుడు. వ్యాఘ్ర దత్తుడి ఖైదునుంచి విడిపించుకు వస్తున్నాం. ఈయన సాధ్యమైనంత త్వరలో శివదత్తుణ్ణి కలుసుకోవాలి. అయన ఎక్కడ వున్నదీ





కూడా అక్కడికి పోవలసిందేగదా ?" అని అడిగాడు సమరసేనుడు.

అందుకు అందరూ అవునన్నట్టు తలలు వూపారు. పోతే ఆ పటాన్నిబట్టి ఆ చోటుకు దారితీయవలసిన బాధ్యత సమరసేనుడి మీదే పడింది. అతడు ఒకసారి పల్లెకేసి తిరిగిచూశాడు. అప్పటికే పల్లెఅంతా తగలబడిపోతోంది. కసికొందికీ వ్యాఘ్రదత్తుడి సైనికులు పల్లెకు నిప్పుపెట్టి వినోదంచూస్తూ గంతులేస్తున్నారు.

సమరసేనుడు తనదగ్గరవున్న కొద్దిమంది సైనికులతో, వ్యాఘ్రదత్తుడి సైనికులను ఎదుర్కొనటం ప్రమాదమని నిర్ణయించుకున్నాడు. ఇక తను తక్షణం చేయవలసింది ; బయలుదేరి శివదత్తుణ్ణి కలుసుకోవటం. అతడిద్వారా వినవలసిన రహస్యం ఏదయినా వుంటే వినటం.

సమరసేనుడు చిత్రపటంకేసి ఓమారు చూసి ముందుకు దారితీశాడు. పటంలో సూచించిన దిక్కుల ననుసరించి జాగ్రత్తగా వెళ్ళవలసివుంది. అంతేకాక మార్గమధ్యంలో వ్యాఘ్రదత్తుడి సైనికులబారి పడకుండా జాగ్రత్తపడాలి.

కొంతదూరం అడవిలోంచి నడిచి అందరూ ఒక కొండప్రాంతం చేరుకున్నారు.



ఆ ప్రదేశమంతా చిన్నా పెద్ద కొండలతో ఎగుడుదిగుడుగావుంది. ఎటుచూసినా కాలిబాటల ఆనవాళ్ళుగాని, జననివాసాలుగాని కనబడటంలేదు.

సమరసేనుడు ఒక మిట్టప్రదేశం ఎక్కి చుట్టూ కలయచూచాడు. కొండదిగువలో చిన్నచిన్న కనుమలు మాత్రం కనిపించాయి. ఒకచోట మాత్రం కొంత సమతల ప్రదేశం కానవచ్చింది.

అక్కడికి చేరితే—అక్కడినుంచి బహుశా ముందు అనుసరించవలసిన మార్గం కనబడవచ్చునని సమరసేనుడు భావించాడు. అంతా అదృష్టం అనిపించింది.





వాళ్ళు కొండమీంచి కిందకు దిగారు. ఆ ప్రదేశమంతా పెద్దపెద్ద బండరాళ్లతో, చిన్న చిన్న చెట్లపొదలతో భీకరంగా వుంది. పటంలో కనబరచిన పాడుబడిన గృహాలు గాని, అక్కడికి వెళ్ళేందుకు మార్గం సూచించే గుర్తులుగాని ఎక్కడా లేవు.

సమరసేనుడూ, సైనికులూ కొంత ముందుకు వెళ్ళేసరికి వారికి ఆశ్చర్యాన్నీ, భయాన్నీకూడా కలిగించే ఒక దృశ్యం కంటబడింది. ఎత్తయిన ఒక కొండ అంచునుంచి పెద్ద జలధార ఒకానొక రాక్షసుడి నోట్లోనుంచి కిందకు దూకుతోంది. కొండరాతిలో ఆ రాక్షసాకారంలో వున్న తల చక్కగా మలచబడివుంది. చూచేవారికి జలధార ఆ భయంకరమైన శిరస్సులో పుట్టి బయటికి వస్తూన్నట్టు కనబడుతోంది.

"ఇది చాలా వింతగా వుంది. ఈ చుట్టుపక్కల ఎక్కడా మానవ నివాసాలే వున్నట్టు తోచదు. కాని ఈ శిరస్సు మానవులవల్లనే చెక్కబడిందనటం స్పష్టం," అంటూ సమరసేనుడు చాలా ఆశ్చర్యపడ్డాడు. సైనికులకు ఏమనేందుకూ తోచలేదు. నలుగురూ ఆ జలపాతంకేసి చూస్తూ నిలబడ్డారు. జలపాతానికి వెనక సొరంగం వొకటి వున్నట్టు కనబడుతోంది. బహుశా శివదత్తుడు దానినుంచే పారిపోయివుండవచ్చునన్న అనుమానం కలిగింది సమరసేనుడికి. అది చాలా సురక్షితమైన ప్రదేశమూ, ఎవరూ అనుమానించేందుకు వీలులేని చోటూ ఐవుండవొచ్చు.

సమరసేనుడు, శివదత్తుడు పంపిన పటం తీసి చూశాడు. అందులో ఒకచోట జలపాతం గుర్తు కనిపించింది. దానితో అతడికి తన అనుమానం నిజమని ధృవపడింది. సైనికులు వెంటరాగా అతడు మోకాటిబంటి నీటిలో నడిచి జలపాతం వెనక వున్న సొరంగంలోకి జొరబడ్డాడు.





కొంతదూరం వరకూ అంతా చీకటిగా వుంది. ధైర్యంచేసి మరికొంత నడిచేసరికి వెలుగు కనిపించింది. చివరకు సొరంగం చివరిభాగం—అవతల సమతలప్రదేశం కనిపించినై. ఆ ప్రదేశం అంతా చాలా పల్లంగా వుంది. చుట్టూ ఎత్తయిన కొండలు.

సమరసేనుడూ, సైనికులూ సొరంగం నుంచి బయటకి వచ్చేసరికి యెక్కడ చూచినా నెమళ్లు గుంపులు గుంపులుగా కనబడినై. నాట్యంచేసేవి కొన్నీ, గాలిలో ఎగురుతూ వింతవింత కేకలువేస్తూ కొన్నీ.

"ఇన్ని నెమళ్ళను నేనెక్కడా చూడ లేదు," అన్నాడు సమరసేనుడు ఆశ్చర్య పోతూ. అతడి వెంటవున్న సైనికులలో ఏ ఒక్కరుకూడా ఇలాంటి వింతప్రదేశాన్ని ఎక్కడా చూచిఎరగరు.

కేవలం నెమళ్ల అందచందాలనుచూస్తూ నుంచుంటే పనికాదు. శివదత్తుడు ఎక్కడ వున్నదీ ముందు తెలుసుకోవాలి.

వాళ్ళు మరికొంత దూరం ముందుకు నడిచి, ఎదురుగా వున్న ఒక గుహను సమీ పించారు. హఠాత్తుగా వారందరికీ ఏనుగు ఘీంకరించిన శబ్దం వినబడింది. అందరూ విస్తుపోయి చూస్తూన్నంతలో, గుహలో నుంచి ఒక ఏనుగు వేగంగా పరుగెత్తుతూ బయటికి దూకింది.

ఇలాంటి సంఘటనకు సన్నద్ధంగా లేని సమరసేనుడూ, సైనికులూ ఏనుగు ఒక్క సారి ముందుకు వురికేసరికి గుండెలు బేజా రెత్తి చెల్లాచెదరుగా పక్కలకు పారిపోయారు.

సమరసేనుడు ఒక పెద్ద రాయివెనక దాక్కున్నాడు. ఏనుగు సొరంగంనుంచి ఘీంకరిస్తూ బయటకు దూకటమంటే - అవతల దానికేదో ప్రమాదం కలిగివుండాలి!

అక్కడ ఎవరు వున్నారో తెలుసుకోవటం ఎలా? శివదత్తుడు పటంలో సూచించిన గుర్తుల్ని తను గ్రహించలేకపోయాడా?

(ఇంకా వుంది)






# ముగ్గురు తంటాలు

ఒక ఊళ్ళో తంటా, మహాతంటా, భలే తంటా అని ముగ్గురు అన్నదమ్ములుండే వారు. వారు వృత్తిచేత దొంగలు కాక పోయినా, చోరవిద్యలో నిపుణులు. వారు తమ నైపుణ్యాన్ని రాజుగారికి చూపటానికి నిశ్చయించుకొన్నారు.

పెద్దవాడైన తంటా, రాజుగారికి ఒకనాడు ఈ విధంగా ఉత్తరం వ్రాశాడు :

"నేను రేపు తమ నగరానికి వచ్చి దొంగతనం చేయబోతున్నాను. కనుక తమ పౌరులందరినీ జాగ్రత్తగా ఉండమని హెచ్చరించవలసింది—ఇట్లు, తంటా."

దొంగతనం చేయబోయేవాడు ముందుగా చెప్పి చేస్తాడా? ఎవరో చిలిపితనంచేత ఇలా రాసివుంటారు అనుకొన్నాడు రాజు. అయినా ప్రజలను కాపాడటం తన ధర్మం గనక, "తరటా అనేవాడు రేపు నగరంలో దొంగతనం చేస్తాడట. అందుచేత పౌరులందరూ హెచ్చరికగా ఉండండి!" అని చాటింపు వేయించాడు. చాటింపు వినగానే ప్రజలు తమ సొత్తును భద్రపరచుకొన్నారు.

చెప్పినప్రకారమే మర్నాడు తంటా నగరానికి చేరుకొన్నాడు. పూటకూళ్ళఅవ్వ యింటికి వెళ్లి భోజనం సిద్ధంచేయమన్నాడు.

"ఇప్పుడే బావికి వెళ్ళి మంచినీరు తెచ్చి వంటచేస్తాను. కూచో, నాయనా!" అని చెప్పి అవ్వ బిందె తీసుకొని వెళ్లింది. వంట అయినాక భోజనంచేస్తూ తంటా, "విశేషాలేమిటవ్వా?" అని అడిగాడు.

"ఎవరో తంటా అనేవాడు వచ్చి ఊళ్ళో దొంగతనం చేస్తాట్ట. చాటింపు వేశారు. డబ్బున్నవాళ్ళంతా హడిలి చస్తున్నారు," అన్నది అవ్వ.

తంటా భోజనం పూర్తిచేసి అవ్వకు ఒక రూపాయి ఇచ్చాడు. "ఒకటీ," అంటూ అవ్వ ఆ రూపాయిని పిడతలో వేసింది.

వి. లక్ష్మీకాంత



తంటా పూటకూళ్ళ ఇంటినుంచి ఒక పెద్ద దుకాణానికి వెళ్లాడు. "శ్రేష్ఠిగారూ, తమలపాకులు మోద ఎంతచేసి ఇస్తున్నారు?" అని అడిగాడు.

"చవుకే, నాయనా! నాలుగణాలు," అన్నాడు శ్రేష్ఠి.

"ఇదుగో, పావలా. మోదలో మూడు వందలకు ఒక్క ఆకు తక్కువ ఉంటే నేను ఒప్పను. ముందు నాకు అవసరానికి పాతిక ఆకులివ్వండి. మిగతావి మళ్ళీ వచ్చి తీసుకుపోతాను. ఇప్పుడు నేను వేరే అవసరమైన పనిమీద పక్క బజారుకు పోతున్నాను," అన్నాడు తంటా.

డబ్బు ముందే ముటిందిగనక, "అలాగే చెయ్యి, బాబూ," అన్నాడు శ్రేష్ఠిగారు.

అక్కడినుండి బయలుదేరి తంటా బట్టల వర్తకుడిదగ్గిరికి వెళ్ళాడు. "మంచి కాశ్మీరుశాలువలుంటే చూపుతారా?" అని అడిగాడు. మూడువందల రూపాయల ఖరీదుచేసే శాలువను బేరంచేశాడు. చాలా సేపు గీసిగీసి బేరంచేయగా వర్తకుడు పాతిక రూపాయల తక్కువకు ఒప్పుకొన్నాడు.

"చూడండి. ఊళ్ళో దొంగభయంగా ఉందని చాటించటంవల్ల పైకం వెంట పెట్టుకురాలేదు. నా సొత్తంతా శ్రేష్ఠిగారి అంగడిలో ఉంచాను. నావెంట మీ మనిషి ఎవరైనా వస్తే వెంటనే డబ్బిప్పిస్తాను," అన్నాడు తంటా.

బట్టలవర్తకుడు శాలువా తంటాకిచ్చేసి, డబ్బు పట్టుకురావటానికిగాను తన తమ్ముణ్ణి అతనివెంట పంపాడు. తంటా శ్రేష్ఠిగారిదగ్గిరికి వచ్చి, "అయ్యా, నేను వెళ్ళిపోతున్నాను. ఈ మనిషికి పాతిక తక్కువ మూడు వందలూ ఎంచి త్వరగా ఇవ్వండి!" అని చెప్పాడు.

"అలాగే, బాబూ! తమరు వెళ్ళండి," అంటూ తమలపాకులకట్టలు తీశాడు శ్రేష్ఠి. తంటా వెళ్ళిపోయాడు.



శ్రేష్ఠిగారు తమలపాకులు ఒక్కొక్కటీ లెక్క పెట్టసాగాడు. వర్తకుడి తమ్ముడు, "శ్రేష్ఠిగారూ, నన్ను త్వరగా పంపరా? అవతల బోలెడంత పని ఉంది," అన్నాడు.

"నీ పనేగదయ్యా చూస్తున్నాను?" అన్నాడు శ్రేష్ఠి.

"తమలపాకులు లెక్క పెడుతూ, నా పని చూస్తున్నానంటావేమయ్యా?" అన్నాడు వర్తకుడి తమ్ముడు.

ఇద్దరూ ఘర్షణపడ్డారు.

"ఆ మనిషి మాకు పాతికతక్కువ మూడువందల రూపాయలు బాకీ," అన్నాడు వర్తకుడి తమ్ముడు.

"నే నాయనకు ఇవ్వాలిసింది పాతిక తక్కువ మూడువందల తమలపాకులు. రూపాయలు నే నెక్కడ తెచ్చి ఇచ్చేది?" అన్నాడు శ్రేష్ఠి.

ఇద్దరూ తగువులాడుకొని న్యాయంకోసం రాజుగారిదగ్గిరికి వెళ్ళారు. రాజుగారు జరిగినదంతా విని, ఇది తంటా చేసిన పనే అని ఊహించి, నష్టం ఇద్దరినీ సమంగా భరించమన్నాడు.

ఆరోజు సాయంకాలానికల్లా రాజుగారికి మరొక లేఖ వచ్చింది. మర్నాడు నగరంలో దొంగతనం చేయబోతున్నానని మహాతంటా తెలియబరిచాడు.





ఈసారి రాజుగారు జాగ్రత్తపడ్డాడు. మంత్రిని పిలిపించి, "మహాతంటా అనే వాడు రేపు నగరంవచ్చి దొంగతనంచేస్తాట్ట. వాణ్ణి పట్టుకునే పూచీ నీది!" అన్నాడు.

మర్నాడు మహాతంటా నగరంచేరి పూట కూళ్ళవ్వ ఇంటికి వెళ్ళి అన్నం పెట్ట మన్నాడు. మంచినీళ్ళు తేవటానికి అవ్వ బిందె తీసుకొని బావికి వెళ్ళింది. ఈ సమయంలో మహాతంటా పిడతలోని రూపాయి కాస్తా కాజేశాడు.

అవ్వ తిరిగి వచ్చి వంటచేసి మహా తంటాకు పెట్టింది. మహాతంటా, "అవ్వా, ఏమిటి విశేషాలు?" అని అడిగాడు.

"ఏముంది, నాయనా? నిన్న తంటా అనేవాడు వచ్చి ఇద్దరు వర్తకులను మోసం చేసి వెళ్ళాడు. ఇవాళ మహాతంటా వచ్చి దొంగతనం చేస్తాట్ట. వాణ్ణి పట్టుకోవటానికి మంత్రిగారు స్వయంగా ప్రయత్నిస్తున్నారు," అన్నది అవ్వ.

"పాపం! మంత్రిగారికి పిల్లా, జెల్లా ఉన్నారు కామోలు," అన్నాడు మహా తంటా జాలినటిస్తూ.

"ఒక్కతే కూతురు, నాయనా! చిన్న తనంలోనే దాని మొగుడు దేశాలమీద పోయాడు. తిరిగి రాలేదు," అన్నది అవ్వ.

మహాతంటా భోజనం ముగించి అవ్వకు రూపాయి ఇచ్చి వెళ్ళిపోయాడు. "రెండు," అంటూ అవ్వ ఆ రూపాయిని పిడతలో పడవేసింది.

మహాతంటా వేషం మార్చుకుని నగరంలో ఒక చెరువుగట్టున వున్న చెట్టుకింద కూచున్నాడు. వచ్చేపొయ్యేవారితో తాను మంత్రిగారి అల్లుణ్ణని చెప్పసాగాడు. ఈ వార్త త్వరలోనే మంత్రిగారికి తెలిసింది. ఆయన చెరువుగట్టుకు వచ్చి మహాతంటాను చూసి, ఏనాడో లేచిపోయిన అల్లుడు తిరిగి రానే వచ్చాడన్న ఆనందంతో తన యింటికి తీసుకుపోయాడు.

అ రాత్రి భోజనాలయాక మంత్రి దొంగను పట్టటానికి బయటికి పోబో తుండగా, మహాతంటా తానుకూడా సహా యంగా వస్తానని పట్టుపట్టాడు. మంత్రి సరేనన్నాడు.

మంత్రిగారి ఇంటి చేరువలోనే నేరస్తులను శిక్షించే యంత్రం ఉన్నది. దాన్ని చూపి, "ఇదేమిటి, మామయ్యా?" అని అడిగాడు మహాతంటా.

"ఇందులో తల పెట్టి శీల బిగిస్తే బాధ కలుగుతుంది. దొంగలు నిజంచెప్పేస్తారు," అన్నాడు మంత్రి.

"నా తల అందులో పెడతాను శీల బిగించు, మామయ్యా!" అన్నాడు మహాతంటా. అందుకు మంత్రి ఒప్పుకోలేదు.

"నీకు అంత ముచ్చటగా వుంటే నా తలే పెడతాను. చూద్దువుగాని," అంటూ మంత్రి యంత్రంలో తలపెట్టాడు. మహాతంటా శీల గట్టిగా బిగించాడు.

"అంత బిగించకూడదు. మెడ నొప్పి పెడుతోంది. తొందరగా వొదులుచెయ్యి," అన్నాడు మంత్రి బాధతో.

"ఈ శీల వెనక్కు తిరగటంలేదు ఎలా, మామయ్యా?" అంటూ మహాతంటా గిల గిలలాడసాగాడు.




"అత్తనడిగి సుత్తీ, సేనామూ పట్టుకురా!" అన్నాడు మంత్రి.

మహాతంటా మంత్రిభార్యవద్దకు వెళ్ళి, "అత్తా, అత్తా! మామయ్యని దొంగ పట్టుకుని బాధిస్తున్నాడు. ఇంటోఉన్న నగలూ, డబ్బూ వేగిరం ఇచ్చెయ్యి," అని అడిగాడు.

మంత్రి భార్య వెంటనే ఇవ్వక, ఏవేవో ప్రశ్నలు వేయసాగింది.

"అత్త ఇవ్వటంలేదు, మామయ్యా!" అని అరిచాడు మహాతంటా.

"వేగిరం ఇవ్వవే! ప్రాణం పోతోందీ!" అని అరిచాడు మంత్రి. మారుమాటాడక మంత్రిభార్య ఇంట్లో వున్న నగలూ, డబ్బూ

కూడా మూటగట్టి ఇచ్చేసింది. వాటిని తీసుకొని మహాతంటా తన దారిన తాను వెళ్ళిపోయాడు. మర్నాడు ఉదయం ఎవరో వచ్చి మంత్రిని విడిపించారు.

ఆరోజే భలేతంటానుంచి రాజుగారికి మూడో ఉత్తరం వచ్చింది. అది చూడగానే రాజుగారికి మండిపోయింది. వరుసగా రెండు దొంగతనాలు చెప్పిచేస్తే దొంగలను పట్టుకోవటం సాధ్యపడలేదు. ఈసారి దొంగను తానే స్వయంగా పట్టుకోవాలని రాజు నిశ్చయించుకొన్నాడు.

మర్నాడు భలేతంటా నగరం చేరాడు. పూటకూళ్ల యింటికి వెళ్లి అవ్వను భోజనం పెట్టమన్నాడు. అవ్వ బిందె తీసుకొని బావికి వెళ్ళగానే, పిడతలోని రూపాయి కాజేశాడు.

అవ్వ తిరిగి వచ్చి, వంటచేసి, వడ్డించేటప్పుడు, "అవ్వా, ఏమిటి విశేషాలు ?" అని అడిగాడు భలేతంటా.

"ఏముంది, నాయనా? ఒకరోజు తంటా అనేవాడు వచ్చి దొంగతనం చేశాడు. ఇంకో రోజు మహాతంటా అనేవాడు వచ్చి దొంగతనం చేశాడు. ఇవాళ భలేతంటా వస్తాట్ట. వాణ్ణి పట్టుకునేటందుకు రాజుగారు స్వయంగా పూనుకున్నారు," అన్నది అవ్వ. భలేతంటా రూపాయి ఇచ్చాడు. "మూడు," అంటూ అవ్వ దాన్ని పిడతలో వేసింది.






భలేతంటా ఊళ్ళో తిరిగి అనేక రకాల తినుబండారాలు కొని, వాటిని జంగిడీలో పెట్టుకుని, శ్మశానం సమీపంలో ఒక చిన్న పందిరివేసి దానికింద ఆ రాత్రి దుకాణం పరిచి దీపం పెట్టుకుని కూచున్నాడు.

ఆ రాత్రి గుర్రంయొక్క నగరమంతటా పహరా తిరుగుతున్న రాజు చీకటిలో ఈ దీపంచూశాడు. ఆయనకు అనుమానం వేసింది. భలేతంటా దగ్గిరికి వచ్చాడు.

"ఇంత రాత్రివేళ ఈ ప్రాంతంలో దుకాణం పెట్టావే? ఎవరు వస్తారు?" అని రాజు అతణ్ణి అడిగాడు.

"అయ్యా, దొంగలు ఇటుగా వచ్చి నా దగ్గిర చిరుతిళ్ళు కొనుక్కొని బాగా డబ్బిస్తారు. వాళ్ళు వచ్చేవేళయింది. తమరు వెళ్ళిపొండి, బాబూ! బీదవాణ్ణి, నాలుగుడబ్బులు చేసుకుంటున్నాను!" అన్నాడు భలేతంటా.

"నీకు నేనంతకంటె పదింతలు డబ్బిస్తానురా! నన్నిక్కడ దాక్కోనియ్యి," అన్నాడు రాజు.

"ఇక్కడ దాక్కునేటందుకు చోటే దండి? కావలిస్తే ఈ గోతాంలో కూచోండి. మూతి కట్టేస్తాను. దొంగలు తెలుసుకోలేరు," అన్నాడు భలేతంటా.

నలిగిపోతాయని దుస్తులూ, తలపాగా, కత్తీ తీసేసి రాజు గోతాంలో దూరాడు. భలేతంటా గోతాం మూతి బిగించికట్టాడు.

"అయ్యా, దొంగలు వస్తున్నట్టున్నారు. నేను తమ గుర్రాన్ని దూరంగా కట్టివేసి వస్తాను. చప్పుడుమాత్రం చెయ్యకండి!" అంటూ భలేతంటా, రాజుగారి దుస్తులూ, తలపాగా, కత్తీ తీసుకుని గుర్రంతోసహా దూరంగా వెళ్ళి, అక్కడ వాటిని ధరించి, గుర్రంయొక్క నేరుగా ఖజానాకు వెళ్ళాడు.

ఖజానా నౌకర్లు భలేతంటాను చూసి రాజే అనుకొన్నారు. చీకటిలో మొహం తెలియలేదు.

"ఒరే, భలేతంటా ఖజానా దోస్తాట్ట! ఖజానాలో ఉన్న డబ్బంతా మూటకట్టి పట్టుకురండి!" అన్నాడు భలేతంటా రహస్యం గొంతుతో.

నౌకర్లు వాడు చెప్పినట్టే చేశారు. ఖజానాలో వున్న డబ్బంతా కొల్లగొట్టి భలేతంటా తనదారిన తాను వెళ్లిపోయాడు.

మర్నాడు చాలా పొద్దెక్కిన తరవాత దారిన పోయేవారెవరో రాజుగారిని సంచీలో నుంచి విడిపించారు.

చెప్పి మోసంచేసిన ఈ దొంగలను పట్టుకోవటానికి రాజు యెన్నో యత్నాలు చేశాడు. కాని వారు దొరకలేదు. చివరకు ఒకనాడు ముగ్గురు తంటాలూ తమకుతామే రాజుగారి దర్శనానికి వచ్చారు.

"ఎవరు మీరు?" అని అడిగాడు రాజు.

వాళ్లు తమ పేర్లు చెప్పగానే రాజుకు చెప్పరాని ఆగ్రహం వచ్చింది. వారిని ఖైదుచేయమని భటులకు ఆజ్ఞాపించాడు.

"తొందరపడకండి, ప్రభూ! మేము దొంగలము కాము. చోరవిద్యానిపుణులము. మా శక్తిని ప్రభువువారికి ప్రదర్శించి బహుమానం పొందవచ్చాము. మేము దొంగిలించిన సొత్తు చిల్లిగవ్వతోసహా యెవరిది వాళ్ళకిస్తాము," అన్నారు ముగ్గురు తంటాలు.

రాజుగారి ధనం రాజుగారికీ, మంత్రిగారి సొత్తు మంత్రిగారికీ, కాశ్మీరుశాలువబట్టల వర్తకుడికీ, రెండు రూపాయలు పూటకూళ్ళ అవ్వకూ తిరిగి ఇచ్చేశారు.

రాజు సంతోషించి, "మీకేమి కావాలి?" అని అడిగాడు.

"అయ్యా, మమ్మల్ని తమ కొలువులోకి తీసుకోండి. తమ రాజ్యంలో దొంగ అనేవాడు లేకుండా చూస్తాము. ఇదే మేము కోరే బహుమతి!" అన్నారు తంటాలు.

వారు కోరినట్టే రాజు వారిని తన కొలువులో ఉంచుకొని ఆదరించాడు.






ఒక ఊళ్ళో దమ్మిడీల గోపయ్య అనే లోభి ఉండేవాడు. అతని భార్య సుందరమ్మ మంచి అందగత్తె. సుఖంగా బతకటానికి తగినంత ఉండికూడా గోపయ్య పేదవాడిలాగా జీవిస్తూ ప్రతిదమ్మిడీ పోగుచేసేవాడు. భార్యకు ఒక్క నగ అయినా చేయించేవాడుకాడు.

ఒకనాడు, పొరుగింటి పోలయ్య తన భార్యకు అయిదువందలు పెట్టి చంద్రహారం చేయించాడు. పోలయ్య భార్య ఆ చంద్రహారాన్ని మెళ్ళో వేసుకుని ఒకసారి ఊరంతా చుట్టివస్తూ సుందరమ్మకుకూడా కనబడి వెళ్ళింది. ఆ చంద్రహారాన్ని చూసినది మొదలు సుందరమ్మకి నిద్రపట్టలేదు. అటువంటి చంద్రహారం తనకుకూడా కొని పెట్టితీరాలని సుందరమ్మ పట్టుబట్టింది.

"ఎందుకే, డబ్బుదండగ! కూటికా గుడ్డకా? అయిదువందలు పెడితే ఎకరం పొలం వస్తుంది, రెండు జతల ఎడ్లు వస్తాయి!" అని గోపయ్య అన్నాడు.

"పోలయ్య మనకన్న ఉన్నవాడుకాడు. మనకు పిల్లాపీచూ లేదుగాని, వాళ్ళకు నలుగురు పిల్లలుకూడానూ. పోలయ్య భార్య కోతిలాగా ఉంటుంది. అటువంటప్పుడుకూడా పోలయ్య తన భార్యకు చంద్రహారం చేయించిపెట్టాడు. నాకు మీరు ముక్కుపుడకైనా చేయించరు!" అన్నది సుందరమ్మ.

గోపయ్యకు కోపంవచ్చి పోలయ్యను తిట్టాడు. "పోలయ్య ఒళ్ళుపై తెలియకుండా డబ్బు తగలేసుకోవటంకాక, ఇరుగు పొరుగిళ్లవాళ్ల కాపరాలుకూడా పాడు చేస్తున్నాడు!" అని కేకవేశాడు.

భార్య ఎంతో ముచ్చటపడి అడిగిన చంద్రహారం కొనటానికిమటుకు ఎంత బతిమలాడినా గోపయ్య ఒప్పలేదు.

పి. రామకృష్ణశాస్త్రి

తన మెళ్ళో చంద్రహారం వేసుకుంటే చూసి భర్త మెత్తపడతాడేమోనని సుంద రమ్మ, పోలయ్య భార్యవద్ద ఒకరోజు సాయంకాలం అరువుతీసుకుని చంద్రహారం తన మెడలో వేసుకుని, భర్తవద్దకు వచ్చి, "ఏమండీ ఎలావుంది?" అని అడిగింది.

గోపయ్య తన భార్యమెడకేసి చూసి క్షణంపాటు ఆనందించాడు. కాని తనను చంద్రహారం చేయించమంటుందేమోననే భయంతో, "బాగానే వుందిగాని, అంత ఖరీదైన వస్తువు మన కెందుకే? దొంగలు ఎత్తుకుపోగలరు. వేగిరం వెళ్లి వాళ్ల నగ వాళ్లకు ఇచ్చేసిరా!" అన్నాడు.

"బోలెడంత పనివుంది. రేపుదయం ఇచ్చేస్తాను," అన్నది సుందరమ్మ ముఖం ముడుచుకుని.

ఆ రాత్రి గడిచిపోయింది. తెల్లవారగానే సుందరమ్మ అదుర్దాగా తన భర్తదగ్గిరికి పరిగెత్తుకు వచ్చి :

"ఏమండీ, మీరుగాని పొరబాటున ఒక రాత్రివేళ దొడ్డివాకిలి తలుపు తెరిచి పెట్టారా?" అని అడిగింది.

"లేదే? దొంగలు రాలేదుకద? వాళ్ళ చంద్రహారం ఇచ్చేశావా? ఏమైనా వస్తు వులు పోయాయేమో చూడు!" అని గోపయ్య అదుర్దాపడ్డాడు.



"చంద్రహారం బొట్టుపెట్టెలో దాచాను లెండి. ఇంటో ఏమీ పోయినట్టు లేదు," అంటూ సుందరమ్మ బొట్టుపెట్టె తెరిచి చూసింది. అందులో చంద్రహారం లేదు.

ఇంకేముందీ? సుందరమ్మ శోకాలు ప్రారంభించింది. గోపయ్యకు పైప్రాణాలు పైనే పోయాయి.

"బుద్ధితక్కువదానా! అంత ఖరీదైన వస్తువు అప్పుడే తిరిగి ఇచ్చుకోరూ? ఇప్పుడయిదువందలూ ధారపోసి నగ చేయించి వాళ్ళకు ఇవ్వాలికద!" అన్నాడు.

"మీరు దొడ్డి తలుపు మూయకుండా పెడతారని నేను కలగన్నానా?" అన్నది సుందరమ్మ.

"నేనా తలుపు తెరిచినట్టు నాకు జ్ఞాపకంలేదు," అన్నాడు భర్త.

"ఒట్టి నిద్రమొహం! తలుపు మీరు తెరవకపోతే నేను తెరిచానా ఏమిటి?" అన్నది భార్య కోపంగా.

ఏమయినా, గోపయ్యకు అయిదువందలు ఖర్చుచేసి మరో చంద్రహారం చేయించక తప్పిందికాదు.

దాన్ని తెచ్చి భార్యకుయిస్తూ, "వేగిరం దీన్ని తీసుకుపోయి పోలయ్యగారింటో ఇచ్చిరా! అజాగ్రతవల్ల ఇంతకుముందు అయినశాస్తి చాలు!" అన్నాడు.

సుందరమ్మ భర్తమాటలు విననట్టే ముసిముసి నవ్వులు నవ్వుతూ, చంద్రహారం తీసుకొని మెడలో వేసుకుని:

"ఇది మనదేలెండి. నేను చంద్రహారం బొట్టుపెట్టెలో పెట్టలేదు, చందుగాయి పెట్టెలో పెట్టి పారబడ్డాను. అది తరవాత కనబడితే అరోజునే దాన్ని పోలయ్యగారింట భద్రంగా ఇచ్చేశాను. కనక పోలయ్యగారికి మనం ఏమీ చేయించి యివ్వనవసరం లేదు," అన్నది.

భార్య గడుసుతనానికి గోపయ్య నివ్వెరపోయి, ఏమాటా అనలేకపోయాడు.






బోధిసత్వుడు ఒకప్పుడు, బ్రహ్మదత్తుని కాశీరాజ్యంలో ఒక నెమలిగా జన్మించాడు. ఇది మామూలు అన్ని నెమళ్ళవంటిది కాదు. అపురూపమైన బంగారు నెమలి! ఇది దండకారణ్యంలో విహరిస్తూ ఉండేది.

ఒకనాడు కాశీరాజు భార్యలలో ఒకామెకు ఈ బంగారు నెమలి కలలో కనబడగా, అది కావాలని ఆమె భర్తతో చెప్పింది. రాజు మంత్రులను అడిగాడు. వారు బ్రాహ్మలకు తెలుస్తుందన్నారు. బ్రాహ్మలనడిగితే వారు వేటగాండ్రకు తెలుస్తుందని చెప్పారు.

రాజు దండకారణ్యానికి సమీపంలో వుండే ఒక వేటగాణ్ణి రప్పించి, 'ఫలానా బంగారు నెమలిని జీవాలతో తీసుకువస్తే గొప్ప బహుమానం ఇస్తాము' అని చెప్పాడు. వేటగాడు అంగీకరించి వరుసగా ఏడేళ్ళు మాటువేశాడు. కాని, నెమలి వలలో పడ లేదు. వేటగాడు చనిపోయాడు. నెమలిని కోరిన ఆ రాణీ చచ్చిపోయింది.

'కలలో కనబడిన ఒక నెమలికోసం బెంగపెట్టుకుని, నారాణి మరణించడమా!' అని రాజుకు కోపంవచ్చింది. అప్పుడాయన 'దండకారణ్యంలో బంగారు నెమలి సంచరిస్తూవుంది. దానిమాంసం ఎవరైతే తింటారో వాళ్ళకు జరామరణాలు ఉండవు' అంటూ ఒక ప్రకటన కోట గుమ్మంముందు వేలాడగట్టించాడు.

ఆ రాజు తదనంతరం యువరాజు మళ్ళీ ఇంకో వేటగాడిని బంగారు నెమలి కోసం పంపించాడు. లాభం లేకపోయింది. ఇలా ఆరు తరాలు గడచిపోయినై.

ఏడవసారి గద్దెఎక్కిన రాజుకూడా ఆ ప్రకటనచూచి, వేటగాడిని పంపాడు. వేటగాడుయుక్తిగా ఆ నెమలిని పట్టివేసి కాశీ రాజుకు వప్పగించాడు.

ఆ బంగారునెమలిని చూడగానే రాజుకు ఆశ్చర్యం కలిగి, గౌరవభావం ఏర్పడింది. ఉచితమైన ఒక సింహాసనం పక్కన వేయించాడు దానికి.

అప్పుడు నెమలిరూపంలో ఉన్న బోధిసత్వుడు 'రాజా!—నన్నెందుకు పట్టించి ఇక్కడికి తెప్పించావు?' అని అడిగాడు.

'నీ మాంసం తింటే జరామరణాలు లేవని చెబుతున్నారు' అన్నాడు రాజు.

'అంటే, నన్ను చంపవలసిందేకదా?' అని ప్రశ్నించాడు బోధిసత్వుడు.

'అవు'నన్నాడు రాజు.

'పిచ్చివాడా!—నాకే మరణం నిజమైతే నా మాంసం తిన్నవాళ్ళకు మరణం లేక పోవడమేమిటి?' అని మళ్ళీ ప్రశ్నించాడు.

'నీది బంగారుఛాయ. కనుక, నీమాంసం తిన్నవాళ్ళకు ఆ ఛాయ వస్తుందనీ, వాళ్లకు చావు ఉండదనీ అంటున్నారు' అని చెప్పాడు రాజు.

'అయితే రాజా!—నాకీ బంగారుఛాయ వచ్చిన కారణం చెబుతా విను; పూర్వ కాలమందు ఒకప్పుడు నేనీ రాజ్యానికే మహారాజుగా ఉండేవాడిని. నేను న్యాయంగా పాలించి ధర్మం నిలబెట్టినందుకు ఫలితంగా ఈ జన్మలో బంగారు నెమలిగా పుట్టాను,' అని చెప్పాడు బోధిసత్వుడు.

కాశీరాజు విస్తుపోయాడు. 'ఏమిటీ, ధర్మ పరిపాలనకు ఫలితమా ఇది! నీ మాటకు రుజువేమైనా ఉందా?' అని అడిగాడు.

'లేకేమి?—నేను మహారాజుగా ఉన్న కాలంలో ఒక నవరత్నఖచితమైన దివ్యరథంమీద విహారంచేసేవాడిని. అది ఉద్యానవనంలో కొలనుపక్కన పూడ్చబడివుంది' అన్నాడు బోధిసత్వుడు.

కాశీరాజు ఆప్రకారం కొలనుపక్కన తవ్వించగా దివ్యరథం కనిపించింది!

ఆనాటినుండి రాజు బోధిసత్వుని తనకు గురువుగా ఎంచుకొన్నాడు.





# యుక్తిబలం

పూర్వం కాశ్మీరదేశాన్ని అవంతివర్మ పరిపాలిస్తూ వుండినప్పుడు ఏటా కరువులు వచ్చేవి. జనం తిండికి లేక అల్లాడిపోతూ వుండేవారు.

కాశ్మీర్ ఎత్తయిన కొండలనడుమ వున్న దేశం. అక్కడి నదులు కొండలమీద పుట్టి మహావేగంగా దిగువకు ప్రవహిస్తాయి. ఆ కారణంచేత నదులు పొంగటమనేది తరచుగా జరుగుతూండేది.

నిజానికి అక్కడి భూమి చాలా సారవంతమైనది. మహాపద్మసరస్సుకింద అనేక వేల ఎకరాలు చక్కగా సాగుఅయి బంగారు పంట పండేది.

అయితే అది ప్రజలు అనుభవించే లోపుగా ,ఆ ప్రాంతంలోని వితస్తానది పొంగటమూ, నది వెల్లువ సరస్సులోకి ప్రవహించటమూ, సరస్సు పొర్లి పంటలు నాశనం కావటమూ జరుగుతూండేది.

అవంతివర్మ ఎంతో ధర్మపరుడు. తన వల్ల ఏదో ద్రోహం జరగటంచేతనే తన ప్రజలు ఈవిధంగా కాటకం పాలవుతున్నారనుకున్నాడు. దేవుళ్లకు ఎన్నో పూజలు చేయించాడు, గ్రహాలకు శాంతులు చేయించాడు, యజ్ఞాలూ క్రతువులూ చేయించాడు. ఎన్నిచేసినా వరదలు నిలిచిపోలేదు.

ఇలా కొంతకాలం జరగగా రాజు చెవిని ఒక వార్త పడింది. సుయ్యా అనే వాడొకడు తాను వరదలు పోగొట్టగలనని కనబడ్డవాళ్ళందరి ఎదటా ప్రగల్భాలు పలుకుతున్నాట్ట. వాణ్ణి జనం పిచ్చివాడికింద జమకట్టి తెగవాగించి ఆనందిస్తున్నారు.

ఏటా వచ్చే కాటకాలను పోగొట్టటానికి ఏదైనా చేయటానికి సిద్ధంగా వున్నందువల్ల అవంతివర్మ సుయ్యాను తనవద్దకు పిలిపించాడు. సుయ్యా వచ్చి నమస్కారం చేసి నిలబడ్డాడు.

కె. యమునాబాయి





"నీవు కాటకాలను పోగొడతానంటున్నా వట, నిజమేనా?" అని అడిగాడు రాజు.

"చిత్తం, మహాప్రభూ! వరదలు పోతే కాటకం దానంతట అదే పోతుంది," అన్నాడు సుయ్యా.

"వరదలు ఎలా పోతాయి? నువు పోగొడతావా?" అన్నాడు రాజు.

"చిత్తం, పోగొట్టగలను!" అన్నాడు సుయ్యా.

"మేము చెయ్యలేని పనిని నీవొక్కడవే ఎలా చెయ్యగలవు?" అన్నాడు రాజు.

"డబ్బిప్పించండి. ప్రపంచంలో డబ్బు చెయ్యలేని పని ఏముంటుంది?" అన్నాడు సుయ్యా.

"మా ఖజానాలో వున్న డబ్బంతా పట్టుకుపో. కాని వచ్చేయేడు వరదలు రాకుండాచెయ్యి," అన్నాడు రాజు.

మంత్రి రాజును వారించటానికి యత్నించాడు. కాని రాజు వినిపించుకోలేదు.

సుయ్యా ఖజానానుంచి తాను మోయగలిగినన్ని బంగారునాణాలు మూటకట్టుకుని బయలుదేరాడు. ప్రజలు అతని వెనకడితే కేకలుపెడుతూ, గేలిచేస్తూ బయలుదేరారు. రాజుకు టోపీవేసి సుయ్యా డబ్బు కాజేశాడని కొందరన్నారు. సుయ్యాతో బాటు రాజుకుకూడా పిచ్చిపట్టిందని మరి కొందరన్నారు. సుయ్యా ఆ ధనం తీసుకుపోయి ఏం చేస్తాడో చూడాలని అందరికీ బుద్ధిపుట్టింది.

ఏటా వరదలు తెచ్చే వితస్తా నది కొంత దూరం వెళ్ళాక కొండలసందుగా కనుమలో కుండా ప్రవహిస్తుంది. అనేక వందల ఏళ్లుగా బ్రహ్మాండమైన బండరాళ్ళు రెండు వైపులా గల కొండలమీదినుంచి దొర్లివచ్చి నదికి అడ్డంగా వంతెనలాగా పడివున్నాయి. వరదలు వచ్చినప్పుడు తప్ప మిగతా సమయాల్లో ప్రజలు ఇక్కడే నదిని దాటుతూ వుంటారుకూడానూ. ఈ రాళ్ళవంతెన



మూలంగానే వరదలు రావటమూ, సరస్సు పొర్లటమూ, పంటలు నాశనం కావటమూ జరుగుతూండేది.

సుయ్యా డబ్బుమూట మోసుకుని ఈ ప్రాంతానికే చేరుకున్నాడు. వాడివెనకనే అనేకవేలమంది మనుషులుకూడా వచ్చారు. సుయ్యా నదికడ్డంగా వున్న రాళ్ళమీదికి పోయి, మూటలోనుంచి బంగారునాణాలు తీసి రాళ్లమధ్య గుప్పిళ్లతో పడేస్తూ అవతలి వొడ్డుకు పోసాగాడు.

జనంలో హాహాకారాలు బయలుదేరాయి. సుయ్యా నిజంగా పిచ్చివాడేనని రుజు వయింది. లేకపోతే బంగారం ఆ విధంగా నదిలో పారబోస్తాడా? వాణ్ణి ఆపటానికి కూడా ఎవరికీ శక్యంకాలేదు.

జనంలో కొందరికి అకస్మాత్తుగా చైతన్యం కలిగింది. కొందరు గబగబా నీటిలోకి దిగి బంగారంకోసం వెతకసాగారు. మరికొందరు ముఠాలుగా చేరి పెద్ద పెద్ద బండరాళ్లను ఒడ్డుకు తోసి వాటికింద వున్న బంగారు నాణాలు ఏరుకోసాగారు.

కొద్దికాలానికే ఈ వార్త చుట్టుపక్కల గ్రామాలకు పాకింది. లక్షలాదిజనం వచ్చి, అనేకవందల ఏళ్ళుగా నదికి అడ్డంగా పడివున్న రాళ్లను ఒడ్డుకు పట్టించసాగారు. వాళ్ల ప్రయత్నాలను ప్రోత్సహించటానికి సుయ్యా ఖజానానుంచి ఇంకా, ఇంకా బంగారునాణాలు తెచ్చి కదిలించని రాళ్ల సందుల్లో పడెయ్యసాగాడు.

సాయంకాలంలోపుగా రాళ్ళవంతెన దాదాపు నిర్మూలమైపోయింది. కష్టపడి పనిచేసిన ప్రజలకందరికీ బంగారునాణాలు దొరికాయి.

అదిమొదలు కాశ్మీరప్రజలు వరదలూ, కాటకాలూ లేకుండా సుఖంగా జీవించారు.

సుయ్యాయుక్తికీ, అతడు దేశానికిచేసిన మేలుకూ మెచ్చుకుని అవంతివర్మ అతనికి చాలా ధనమిచ్చి సత్కరించాడు.








# నేర నిరూపణ

ఒక దేశంలో ఒక ధనికుడైన వర్తకుడుండేవాడు. ఆయనకు ముగ్గురు కొడుకులు. చనిపోయే సమయంలో అతడు తన ముగ్గురు కొడుకులనూ చెంతకు పిలిచి, "నాయనలారా, నాకోసం యమదూతలు రాబోతున్నారు. నేనెంతో శ్రమపడి చాలా ఆస్తి గడించాను. ఆ ఆస్తిలోకల్లా విలువైనవి ఈ మూడు రత్నాలు. మీరు ఏ కారణం చేతనైనా వేరుపడ దలిస్తే ఈ మూటినీ ముగ్గురూ తీసుకోండి. మూడూ ఒకే విలువ గలవి," అని చెప్పాడు.

ఆయన పోయాక కొద్దికాలానికి అన్నదమ్ములు వేర్లుపడదామని నిశ్చయించుకున్నారు. ఆస్తిలో ముఖ్యమైనవి రత్నాలు గనక వాటిని తలాఒకటీ తీసుకుందామని రత్నపేటిక తెరిచి చూసేసరికి అందులో రెండే రత్నాలున్నాయి. మూడవదాన్ని ఎవరో దొంగిలించారు. దొంగ ముగ్గురన్నదమ్ములలో ఒకడైవుండాలి. పరాయివాడు కావటానికి వీలులేదు.

"మనలో ఒకరు రత్నాన్ని హరించారు. మనం ఒకరినొకరు నిందించుకోవటం ఎంతమాత్రం భావ్యంగా వుండదు. రత్నాన్ని దొంగిలించినవాడు తన నేరం తాను ఒప్పుకోవటానికి బిడియపడవచ్చు. ఎవరికీ అవమానం జరగకుండా, ఎవరికీ అన్యాయం జరగకుండా రేపులోపల ఈ రత్నాన్ని తీసినవారు తిరిగి యథాస్థానంలో ఉంచేది," అన్నాడు పెద్దవాడు.

"లేనిపక్షంలో ఏంచేయాలి?" అని అడిగాడు రెండోవాడు.

ముగ్గురం వెళ్లి రాజుగారికి ఫిర్యాదు చేద్దాం. నేరాన్ని నిరూపించే భారం రాజుగారిదేగదా?" అన్నాడు పెద్దవాడు.

"ఈ ఆలోచన చాలా బాగుంది," అన్నాడు మూడోవాడు.

ఎ. ఆనందయ్య



మరొకరోజు గడిచింది. పోయిన రత్నం తిరిగిరాలేదు. ఆరోజే ముగ్గురన్నదమ్ములూ ప్రయాణమై రాజుగారివద్దకు వెళ్లి, జరిగినదంతా నివేదించి, తమలో దొంగ ఎవరో నిర్ణయించవలసిందని కోరారు.

ఈ కోరిక విని రాజు నివ్వెరపోయాడు. ఆయన ఈ ముగ్గురన్నదమ్ములనూ ఎరుగు!

"మీ తండ్రిగారు న్యాయవర్తనుడు. నాకు మిక్కలి హితుడు. ఆయన కుమారులు నన్ను ఇలాటి కోరిక కోరటం సంతోషంగానూ, విచారంగానూకూడా వున్నది. మీలో మీరు ఈ చిక్కు విప్పలేకనే నాదాకా వచ్చారు. కొద్దిరోజులలో మీపని ముగిస్తాను. అంతదాకా మీరు పేదరాసి పెద్దమ్మ యింట బసచేసి వుండండి. మీకు కావలసిన సౌకర్యాలన్నీ నేను ఏర్పాటు చేయిస్తాను," అన్నాడు రాజు.

ముగ్గురన్నదమ్ములూ పేదరాసిపెద్దమ్మ యింట బసచేశారు. రోజులు గడవసాగాయి. రాజు అహోరాత్రాలు ఈ సమస్యను గురించి ఆలోచిస్తున్నప్పటికి విచారణ ఏవిధంగా ప్రారంభించాలో, ఎలా సాగించాలో ఎంతమాత్రమూ పాలుపోలేదు. ఒక రోజు రాజుగారు పేదరాసి పెద్దమ్మకు కబురుచేసి ఈవిధంగా అడిగాడు:

"పెద్దమ్మా. అతిథులవల్ల నీకేమీ ఇబ్బంది కలగటంలేదుకద!"

"లేదు, మహాప్రభూ! వాళ్లు ముగ్గురూ ఎంతో మంచివాళ్ళు, ఎంతో పెద్దమనుషులు, మర్యాదస్తులు!" అన్నది పెద్దమ్మ.

"అందుకే ఎటూ పాలుపోవటంలేదు. ఆ ముగ్గురిలో ఒకడు సాహసం గల దొంగ!" అన్నాడు రాజు.

పెద్దమ్మ ఆశ్చర్యపోయి వివరాలడిగింది. రాజు దాచకుండా జరిగినదంతా చెప్పాడు.

"అయితే వారిలో ఎవరు దొంగ అయినదీ నేను తెలుసుకుంటాను, మహాప్రభూ! మీరు విచారించకండి!" అన్నది పెద్దమ్మ.

అ రాత్రి పెద్దమ్మ వర్తకుడి కుమారులకు భోజనంపెడుతూ ఒక చిన్న కథ చెప్పింది. ఆ కథ యిదీ:

"అనగనగా సింహకేతుడని ఒక రాజు. ఆయనకు గుణవతి అని ఒకతే కుమార్తె. ఆమెకు యుక్తవయసు వచ్చేదాకా ఒక పండితుడివద్ద విద్యనేర్పించారు. ఆమె కొరకు వివాహప్రయత్నాలు ఆరంభం కాగానే చదువు మాన్పించారు. ఒకనాడామె తన గురువువద్దకు అనేక వస్త్రాలూ, ఆభరణాలూ, కొంత డబ్బూ తీసుకుని వెళ్ళి గురుదక్షిణ సమర్పించింది. కాని ఆ పండితుడు వాటిని ముట్టక, 'గురుదక్షిణ ఇవ్వదలచినట్టయితే, నీవు పెళ్లాడి పరాధీనవయే లోపుగా ఒక రాత్రి నావద్దకు సర్వాభరణాలు ధరించి ఒంటరిగా రావాలి!' అన్నాడు. గుణవతి సరేనని, వెళ్లిపోయింది.

"తరువాత కొద్ది కాలానికే ఆమెకు వివాహమయింది. వివాహం జరిగిన రాత్రే భర్తతో తన గురుదక్షిణ గురించి చెప్పింది. భర్త, 'సరే, వెళ్ళిరా!' అన్నాడు.

"గుణవతి నగలన్నీ ధరించి గురువుగారింటికి పోతూండగా దారిలో ఆమెను ఒక దొంగవాడు అటకాయించి, నగలన్నీ ఇవ్వమన్నాడు. లేకపోతే చంపుతానన్నాడు.






గుణవతి దొంగవాడితో తన గురుదక్షిణ గురించి చెప్పి, తిరిగి వచ్చేటప్పుడు నగలన్నీ ఇస్తానన్నది.

దొంగ ఒప్పుకున్నాడు.

"గుణవతి గురువుగారింటికి చేరుకున్నది. గురువుగారు తన శిష్యురాలి సత్యసంధతకు సంతోషించి, 'తల్లీ! నేను చెప్పిన చదువు సార్థకంచేశావు. ఏమి ప్రమాదం రాబోయేదీకూడా తెలియకుండానే అన్న మాట నిలబెట్టుకున్నావు. ఇదే నాకు సరి అయిన దక్షిణ. నీవు తిరిగివెళ్ళి నీ భర్తతో సుఖంగా కాపరంచెయ్యి," అని హృదయపూర్వకంగా ఆశీర్వదించాడు.

"గుణవతి గురువుగారికి నమస్కారం చేసి తిరిగివస్తూ, దారిలో తనకోసం వేచివున్న దొంగను చూసి:

"ఇదిగో, బాబూ! నా నగలిక నీవు పుచ్చుకోవచ్చు!' అన్నది.

ఈ మాటతో దొంగ హృదయం మారిపోయింది. వాడు గుణవతి కాళ్లపై బడి, 'తల్లీ, క్షమించు. నీవంటి వాళ్ళుండే ఈ ప్రపంచంలో నేను దొంగతనం చేసి బ్రతకలేను," అంటూ చీకటిలో ఎటో వెళ్ళిపోయాడు.

"గుణవతి తిరిగి భర్తవద్దకు వచ్చి జరిగినదంతా చెప్పింది. భర్త చాలా సంతోషించాడు. వారిద్దరూ చాలాకాలం సుఖంగా కాపరం చేశారు."

పెద్దమ్మ చెప్పిన ఈ కథ విని వర్తకుడి ముగ్గురు కొడుకులూ చాలా ఆనందించారు.

"నాకొక్కటే సందేహం. ఈ కథలో చాలామంది ఉదారులున్నారు. కాని అందరికన్న ఎవరి ఔదార్యం గొప్పది? ఈ సందేహం నన్ను పట్టిపీడిస్తోంది, నాయనలారా! మీరేమైనా నా అనుమానం తీర్చగలరా?" అని అడిగింది పెద్దమ్మ.

పెద్దవాడు కొంచెం ఆలోచించి, "వివాహమైన రాత్రే తన భార్యను గురువువద్దకు

పోనిచ్చిన భర్త ఔదార్యం గొప్పది," అన్నాడు.

రెండవవాడు, "అంతకన్న గురువు ఔదార్యం గొప్పది," అన్నాడు.

మూడవవాడు, "చేతికి చిక్కిన రాజ కుమార్తె నగలను తీసుకోకుండా పోనిచ్చిన దొంగవాడి ఔదార్యం గొప్పది," అన్నాడు.

"భర్తయొక్క ఆగ్రహాన్నీ, గురువుగారి చేత అవమానాన్నీ, దొంగయొక్క దురాశనూ ఎదుర్కొన్న గుణవతి ఔదార్యం మీలో ఒకరికీ నచ్చలేదా, నాయనా?" అంటూ పెద్దమ్మ నవ్వేసింది.

ఆరోజే పెద్దమ్మ రాజుగారివద్దకు వెళ్ళి, "మహాప్రభూ, మా యింటవున్న ముగ్గురు అన్నదమ్ములలోనూ నిశ్చయంగా దొంగ మూడవవాడే. తమరు విచారించి నిజం తెలుసుకోండి!" అన్నది.

ఆమె ఊహకు కారణమేమని రాజు అడిగాడు. పెద్దమ్మ జరిగినదంతా చెప్పి, "ఆ కుర్రవాడు ధనలోభి కానిపక్షంలో దొంగ ఔదార్యాన్ని మెచ్చుకోడు," అన్నది.

రాజు పెద్దమ్మ చెప్పినదాంట్లో సత్యమున్నదని గ్రహించి, ఆమె తెలివితేటలకు ఆశ్చర్యపడ్డాడు.

మర్నాడు ఆయన ముగ్గురన్నదమ్ములనూ పిలిపించాడు.

"రత్నపేటికలో వున్న రెండు రత్నాలనూ పెద్దవాళ్ళిద్దరూ తీసుకోండి. అది న్యాయం!" అన్నాడు రాజు.

మూడవవాడు అన్నల ముఖాలు చూడలేక తల వంచుకున్నాడేగాని రాజు చెప్పిన న్యాయానికి విరుద్ధంగా చెప్పలేదు.

తరువాత ముగ్గురన్నదమ్ములూ ఇళ్ళకు వెళ్లిపోయారు. తండ్రి విడిచిపోయిన మిగతా ఆస్తినికూడా సమంగా పంచుకున్నారు.

ఆతరవాత వాళ్ళెన్నడూ రత్నం ఎవరు దొంగిలించారనే సంగతి మాట్లాడుకోలేదు. ఎంతో సోదరభావంతో కాలం గడిపారు.





# తిట్టు మాటలు

ఒక ఎద్దూ, దున్నపోతూ, గాడిదా ఒక పచ్చికబయలులో కలుసుకుని లోకాభిరామాయణం మాట్లాడుకోసాగాయి.

"నేను బలంగల జంతువును. నా మూలంగా మనుషులు పాడీ పంటా అనుభవిస్తారు. నన్ను రైతులు ప్రాణంగా చూసుకుంటారు. నేను లేకపోతే ప్రపంచమే లేదు. అయినా బుద్ధిలేని లోకులు నా పేరు తిట్టుమాటగా ఉపయోగిస్తున్నారు. మనుషులు ఒకరినొకరు నా పేరుతో తిట్టుకుంటే నాకు చెడ్డకోపం వస్తుంది. ఎన్నాళ్లు సహించి పూరుకునేది ?" అన్నది ఎద్దు.

"నేను మాత్రమేం? నేనూ బండచాకిరీ చేస్తాను. సాధువును. నాతో ఒక్క పేచీ లేదు. నేను పేదరైతు పెన్నిధిని. చచ్చినా కూడా నన్ను కాళ్ళకు తొడుక్కొని తిరుగుతారు. ఎవరికీ ఏ అపకారమూ చెయ్యని నా పేరు తిట్టుమాటకింద మనుషులు వాడుతుంటే నాకెట్లా వుంటుంది చెప్పండి," అన్నది దున్నపోతు.

"ఓర్పుకు నన్నే చెప్పాలి. ఎంత బరువైనా మోస్తాను. కాని యజమానికి నా భారం ఏమీలేదు. ఊరంతా తిరిగి ఎక్కడ తిండి దొరికితే అక్కడే తింటాను. వాన కురిస్తే ఏ చూరు దొరికితే ఆ చూరుకింద నిలబడతాను. ఎండ కాస్తే ఏ చెట్టునీడనో ఉంటాను. నానుంచి యజమానికి ఏ ఇబ్బందీ లేదు. అలాటి నాపేరును మనుషులు మరీ నీచంగా వుపయోగిస్తున్నారు. నేనెవరితో మొరబెట్టుకొనేది?" అన్నది గాడిద.

"మనం ఈ అన్యాయాన్ని భరిస్తూ ఊరుకోరాదు. ఏదో ఒకటి చేసితీరాలి!" అన్నది దున్నపోతు.

ఎద్దూ, గాడిదా తలలు వూపాయి.

"మనం బ్రహ్మదగ్గిరికి వెళ్ళి, ఈ అన్యాయాన్ని ఆపించాలి," అన్నది దున్నపోతు.

డి. శేషాచలపతి

మూడూ కలిసి ప్రయాణమై బ్రహ్మ దేవుడివద్దకు వెళ్ళాయి.

"ఏమిటిలా వచ్చారు?" అని అడిగాడు బ్రహ్మ.

"బ్రహ్మదేవా! మాకు మనుషులు తీరని అన్యాయం చేస్తున్నారు. మా గొప్ప మేమే చెప్పుకోకూడదుగాని, మేము అనామ కులం కాము. శివుని వాహనమైన నందీశ్వరుడు నా సంతతివాడు. యముడి వాహనం దున్నపోతు. ఇక గాడిద సంగతి వేరే చెప్పనవసరం లేదు. శ్రీ మహావిష్ణువు అపరావతారమైన శ్రీ కృష్ణుడి తండ్రిఅయిన వసుదేవుడే గాడిద కాళ్ళు పట్టుకున్నాడు," అన్నది ఎద్దు.

"మీ పూర్వీకులు గొప్పవారే! నే నెరగనా? ఇంతకూ మీకు మనుషులు చేస్తున్న అన్యాయమేమిటో నాకు తెలియటం లేదు. వాళ్లు మీకేం బాధ కలిగిస్తున్నారు?" అని అడిగాడు బ్రహ్మదేవుడు.

"మా పవిత్రమైన పేర్లను మనుషులు తిట్లుగా వాడుతున్నారు," అన్నది ఎద్దు.

"మనుషులు చేసే ఈ అన్యాయాన్ని మీరు అరికట్టాలి," అన్నది దున్నపోతు.

"మనుషులు మమ్మల్ని గౌరవంగా చూసేటట్టు చెయ్యాలి," అన్నది గాడిద.

బ్రహ్మదేవుడు చిరునవ్వు నవ్వి, "ఇది మనుషుల తప్పు కాదు. మీ బుద్ధులనుబట్టి వారికి మీమీద గౌరవం లేకుండాపోయింది. మీమీ ప్రవర్తనలు మార్చుకోండి. వెళ్లి రండి," అన్నాడు.

మూడు జంతువులూ ఇంటిదారి పట్టాయి.

"ఈ దున్నపోతుకు మనుషులంటే పక్షపాతం!" అన్నది గాడిద.

"మనం చెప్పేది వినిపించుకోకుండా ఇంకేదో చెబుతాడు, వెట్టి ఎద్దు!" అన్నది దున్నపోతు.

"అసలి గాడిదదగ్గిరికి వెళ్ళి మొర పెట్టుకోవటమే పొరపాటు!" అన్నది ఎద్దు.





# నీతి గల సామంతు

పూర్వం అయోధ్యను సర్వజితుడనే రాజు పాలించాడు. ఆయన పరిపాలనలో ధర్మం నాలుగుపాదాలా నడిచింది. ప్రజలు సుఖించారు. అయితే సర్వజితుడికి నడివయసులోనే రాజభోగాలపై వైరాగ్యం కలిగింది. ఆయన తన పెద్దకుమారుడికి రాజ్యం వప్పగించి అడవులలో ఏకాంతంగా తపస్సు చేసుకొనటానికి వెళ్ళిపోయాడు.

రెండేళ్ళు గడిచాయి. ఒకనాడు సర్వజితుడు తన ఆశ్రమంనుంచి చాలా దూరం వెళ్లి తిరిగి వచ్చేసమయంలో పెద్ద తుఫాను ప్రారంభమయింది. పట్టపగలే అరణ్యమంతా చీకటి అయిపోయింది. ఆ చీకటిలో ఆయన దారితప్పి చాలాసేపు తిరిగి చివరకు ఒక పర్ణశాలవద్దకు చేరి తలుపు తట్టాడు.

ఆ పర్ణశాలలో సుమంతుడనే ఆయనా, ఆయన భార్యా ఉంటున్నారు. సుమంతుడు తలుపు తెరిచి సర్వజితును లోపలికి ఆహ్వానించాడు. అతిథికి కట్టుకోవటానికి పొడి బట్టలిచ్చాడు. సర్వజితు వాటిని ధరించి, "ఆకలి దహించుకుపోతున్నది. ఉదయం నుంచీ భోజనం లేదు. ఇంత వేడిగంజి అయినా కాచిపొయ్యండి!" అని అడిగాడు.

"క్షణంలో వంట చేస్తాను. విశ్రాంతి తీసుకోండి," అని సుమంతుడి భార్య భర్త చెవిలో ఏదో చెప్పింది. సుమంతుడు పక్క గదిలోకి వెళ్ళాడు. అతను ఏవో కర్రలు విరుస్తున్న చప్పుడు సర్వజితుకు వినిపించింది. మరి కాస్సేపటికి సుమంతుడు కొన్ని కర్రలు తీసుకుని వంటఇంట్లోకి వెళ్ళాడు. అక్కడ అతని భార్య పొయి రాజేసి వంట ప్రారంభించింది.

పొయి మండనారంభించగానే సర్వజితుకు గంధంపుల్లలు కాలే వాసన వచ్చింది. చలికాచుకునే మిషమీద ఆయన పొయివద్దకు వచ్చి కూచున్నాడు. సుమం

ఆర్. ముకుందరావు

తుడి భార్య గంధంచెక్కలతో వంటచేస్తూ ఉండటం ఆయనకు కనబడింది.

"వీళ్ళు ఒకప్పుడు బాగా బతికినవారై ఉండాలి. కనుకనే వీరివద్ద గంధపు చెక్కతో చేసిన వస్తువులున్నాయి. కాని వీరు వంటచెరుకుకూడా లేని బీదస్థితిలో, ఇక్కడ ఎందుకు కాపరం చేస్తున్నారో?" అని సర్వజితు ఆశ్చర్యపడ్డాడు.

కొద్దిసేపటిలోనే సుమంతుడి భార్య వంట చేసి అతిథికీ, భర్తకూ వడ్డించింది.

"నాయనా, నీవూ నీ భార్యా గొప్ప వంశంలో పుట్టినవారుగా కనిపిస్తారు. మీరీ అరణ్యంలో వనవాసం చెయ్యటానికి కారణ మేమిటి?" అని అడిగాడు సర్వజితు.

సుమంతుడు నిట్టూర్చి, "స్వామీ! సంపదలు శాశ్వతం కావు. కొద్దికాలం కిందట నేను సామంతును. శత్రువులు రాజాశ్రయం సంపాదించి నన్ను పదభ్రష్టుణ్ణి చేశారు. కాని నాకేమి తక్కువయింది? నా భార్య పెన్నిధివంటిది. మాకీ అరణ్యం కావలిసినంత అహారం ఇస్తుంది. ఇక్కడ ఉన్నా దేశంకొరకు ప్రాణాలర్పించగలను. నేను ఎప్పటికీ సామంతునే!" అన్నాడు.

"రాజువద్దకు వెళ్ళి న్యాయం కోరక పోయావా?" అని అడిగాడు సర్వజితు.




"న్యాయం చేయగల ప్రభువు వానప్రస్థం వెళ్లిపోయాడు. ఆయనతోనే న్యాయం కూడా అడవులపాలయింది," అన్నాడు సుమంతుడు.

సర్వజితు ఆ రాత్రి అక్కడే గడిపి తెల్లవారుజామున సెలవు తీసుకుని వెళ్ళి పోయాడు.

కొద్దికాలం గడిచింది.

సామంతులందరూ అయోధ్యకు వెంటనే చేరవలసిందని రాజ్యమంతటా దండోరా వేశారు. ఎక్కడెక్కడో ఉండే సామంతు లందరూ పల్లకీలెక్కి, ఏనుగులెక్కి గుర్రా లెక్కి, తమతమ నౌకర్లతో అయోధ్య

చేరారు. ఇలా చేరిన సామంతులలో ఒకడు చూసేవారికి హాస్యాస్పదంగా కనిపించాడు. అతను చినిగిపోయిన చీనాంబరాలతో, చేతిలో పాతకత్తి పట్టుకొని, కాలినడకను, అయోధ్య చేరాడు. అతనే సుమంతుడు.

రాజభటులు సామంతుల విడిదికి వచ్చి సుమంతుణ్ణి వెతికిపట్టుకుని, "ప్రభువుగారు రమ్మంటున్నారు," అని చెప్పారు. సుమంతుడు వారితో రాజువద్దకు వెళ్లాడు.

నిండుసభలో సింహాసనంమీద ఉన్న సర్వజితును చూసి సుమంతుడు నివ్వెరపోయాడు. కాని తన పర్ణశాలకు వచ్చిన వ్యక్తి అయనే అని అతను తెలుసుకోలేదు.

"అందరు సామంతులూ తమ హెూదాకు తగిన విధంగా వస్తే, నీవు ఈ వేషంలో రావటానికి కారణమేమిటి?' అని సర్వజితు అడిగాడు.

"క్షమించండి, మహాప్రభూ! నేను సామంతునేగాని సంపన్నుణ్ణికాను. దేశానికి సేవచేయ వచ్చానుగాని, నా హెూదా ప్రకటించుకోవటానికి రాలేదు," అన్నాడు సుమంతుడు.

సర్వజితు ఆ జవాబుకు చాలా సంతోషించాడు. అయన అప్పటికప్పుడే సుమంతుడికి జరిగిన అన్యాయాన్ని సరిచేసి అతనికి కొత్త అగ్రహారాలుకూడా ఇచ్చాడు.

"ఆరోజు నీ పర్ణశాలకు వచ్చి నీవృత్తాంతం విన్నమీదట నాధర్మం నేను త్యజించానని తెలుసుకొన్నాను. వెంటనే తిరిగివచ్చి, అసమర్థుడైన నా పెద్దకుమారుణ్ణి సింహాసనంమీదినుంచి తొలగించాను. నాతరువాత నా రెండో కుమారుడికి పట్టంగడతాను. వాడికి ధర్మపరిపాలనగురించి నీవే స్వయంగా బోధించు," అని సర్వజితు సుమంతుణ్ణి కోరాడు.

సుమంతుడు తన భార్యతో సహా అయోధ్యలోనే ఉంటూ సర్వజితు రెండవ కుమారుడికి రాజధర్మాలు నేర్పాడు.



# ఇతర చందమామలు

మనం ఆకాశంలో చూసే చందమామ భూమికి ఉపగ్రహం—అంటే గ్రహాలలో ఒకటైన భూమిచుట్టూ తిరిగే గోళం. భూమికి చందమామ ఒకటే ఉపగ్రహం. కాని ఇతర గ్రహాలకు కొన్నిటికి అనేక చందమామలున్నాయి. వాటినిగురించి ఇప్పుడు తెలుసుకోండి.

* గురువుకు పదకొండు చందమామలున్నాయి! అందులో ఒకటి చాలా చిన్నది, గురుగ్రహానికి అన్నిటికన్న సమీపంగా ఉండి రోజుకొకసారి చుట్టు తిరిగివస్తూవుంటుంది. దానికన్న కొంచెం దూరంగా మరి నాలుగు చందమామలున్నాయి. ఇవి నాలుగూకూడా మన చందమామకన్న పెద్దవే! ఇవికూడా గురువుచుట్టూ చాలా వేగంగానే తిరుగుతాయి. వీటిలో అన్నిటికన్న మెల్లిగా తిరిగే చందమామ సుమారు 17 రోజుల కాలంలో గురువును చుట్టివస్తుంది. మరి ఆరు చందమామలు గురువుకు చాలాదూరంగా ఉన్నాయి. ఇవి గురువును చుట్టిరావటానికి చాలాకాలం పడుతుంది. అన్నిటికన్నా మెల్లిగా తిరిగే చందమామ గురుగ్రహాన్ని ఒకసారి ప్రదక్షిణం చేసిరావటానికి 745 రోజులు పడుతుంది!

* శనిగ్రహానికి 9 చందమామలున్నాయి. (పదోదికూడా ఉందంటున్నారుగాని ఈ విషయం ఇంకా గట్టిగా రుజువుకాలేదు.) శని చుట్టూ తిరిగే చందమామలలోకెల్లా పెద్దది టైటన్. అది మన చందమామకన్న పెద్దది. శని చుట్టూ తిరిగే చందమామలలో మరొకదాని పేరు జూపిటస్. ఇది కోలగా వుంటుందని శాస్త్రజ్ఞులు ఊహిస్తున్నారు.

* శనిగ్రహం చుట్టూ తిరిగే చందమామలు కాక మూడు వలయాలున్నాయి. వీటినిండా కోటానకోట్ల సంఖ్యలో అతి సూక్ష్మమైన చందమామలున్నాయని శాస్త్రజ్ఞులు ఊహిస్తున్నారు.

* యురేనస్‌గ్రహం చుట్టూ కనీసం అయిదు చందమామలు తిరుగుతున్నాయి. ఇవి ఈ గ్రహాన్ని చుట్టిరావటానికి కొద్దిరోజుల కాలం పడుతుంది.

* నెప్ట్యూన్ గ్రహం చుట్టూ రెండు చందమామలు తిరుగుతున్నాయి.

* భూమికి చాలా దూరం ఉన్న గ్రహాలచుట్టూ తిరిగే చందమామలను చూడటం చాలా కష్టమైన పని. ఎందుచేతనంటే మన భూమికి గురుగ్రహం 40 కోట్ల మైళ్ళ దూరంలోనూ, శని గ్రహం 80 కోట్ల మైళ్ళ దూరంలోనూ, యురేనస్ 170 కోట్ల మైళ్ళ దూరంలోనూ, నెప్ట్యూన్ 270 కోట్ల మైళ్ళ దూరంలోనూ ఉన్నాయి.

# మాయా చక్రం (అట్టచివరి బొమ్మ) - 3

రాజు, తన రాణితో 'రేపు ఉదయంవరకూ నన్ను ఏమీ ప్రశ్నించవద్దు. అటుపైన సంగతి సందర్భాలన్నీ నీకే తెలుస్తాయి' అని చెప్పాడుకద?

అయితే—ఆనాటి రాత్రి శయ్యామందిరంలో రాణి చెయ్యి నిద్రిస్తున్న రాజు తలకు తగిలింది. ఆమె లేచి చూడగా, అది తనింతకుముందు చూచిన గాడిద తలలాగ కనిపించలేదు. ఈ చిత్రం ఏమిటా అని దీపం వెలుగున పరీక్షగా చూచేసరికి, గాడిదతలా లేదు, ఏమీలేదు! తన భర్త అతిరూపసుందరుడైన రాజకుమారుడు!! ఇది చూచి రాణి సంతోషానికి అంతులేకపోయింది.

రాణి ఈ సంగతి కనిపెట్టిందేకాని, తన తల ఈవిధంగా మారిపోయినట్టు రాజుకు తెలియనే తెలియదు. రాణి దీపం పట్టుకుచూడటంలో రాజుకు మెలకువ వచ్చింది. ఆమె ఆశ్చర్యంతో ప్రశ్నించింది. అప్పుడు తీరని విచారంతో రాజు ఇలా అన్నాడు:

'అయ్యో, దురదృష్టవంతురాలవు. రేపు ఉదయంవరకూ వుండమంటే వుండలేకపోయావు. అప్పటికిగాని నాకు పూర్తిగా శాపవిముక్తికాదు. నీవిలా ప్రశ్నించడంవల్ల శాపమిచ్చిన ఆ రాక్షసికి మళ్ళీ ఎప్పటి శక్తి వచ్చేసింది. నేనామెకు బానిసనై, ఆమె నివసించే తంగేడువనంలోని ఎర్రకోటకు పోవలసిందే...' అని అంటూనే రాజు మాయమైపోయాడు.

రాణి తన తప్పిదానికి చాలా దుఃఖించింది. భర్త ఎడబాటును భరించలేకపోయింది. రాజును వెతుక్కురావటానికని బయల్దేరింది.

ఆమె బయల్దేరి వెళ్ళగా వెళ్ళగా, దారిలో మునుపటి దేవత ఎదురయింది.

'అమ్మా! తంగేడువనంలో ఎర్రకోట వుందట. అక్కడికి దారి చెప్పగలవా?' అని ఆమెనడిగింది రాణి.

అందుకు దేవత 'తల్లీ!—నేను ఎర్రకోటనుగురించి విన్నానేగాని, అక్కడికి ఎన్నడూ పోలేదు. ఆ కోటలో ఒక రాక్షసి నివసిస్తూవుంది. అది మహా క్రూరమైంది. ఐనా, భయంలేదు. ఇదుగో నా మాంత్రిక ఉంగరమిస్తున్నాను. దీన్ని ధరించి వెళితే, నీవు తలచినపని జయమవుతుంది" అని చెప్పి, తన వేలి ఉంగరం రాణికిచ్చి, అది ఉపయోగించవలసిన పద్ధతి చెప్పింది.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1955 మార్చి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ జనవరి 7-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నాతో నేనే ఆడుకొంటా | రెండవ ఫోటో : నాతో నేనే ఆలోచిస్తా

పంపినవారు : ఎం. వెంకటాచలం,

V ఫారం, A/S, మ్యునిసిపల్ హైస్కూలు - రాజమండ్రి.

బహుమతిమొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# వార్తలు-విశేషాలు

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అణుశాస్త్రపరిశోధనకు సదుపాయాలు చేయబడినవి. లేబరేట రీకి అవసరమైన పరికరాలను సమకూర్చటానికి సిండికేట్‌వారు 1,25,000 రూపాయలు కేటాయించారు. ఈ పరిశోధనలకు కేంద్రప్రభుత్వంవారి పూర్తిసహకారం ఉంటుంది.

*　　　*　　　*　　　*

సుప్రీంకోర్టు చీఫ్ జస్టిస్‌గా వుంటున్న మహాజన్‌గారు డిసెంబర్ 23 వ తేదీతో రిటైరవు తారు. ఆయన స్థానంలో పనిచేసేందుకు శ్రీ బి. కె. ముఖర్జీగారు సుప్రీంకోర్టు చీఫ్ జస్టిస్‌గా నియమించబడ్డారు.

*　　　*　　　*　　　*

ఇంగ్లాండుదేశంలో ఇండియా హైకమిషనర్‌గా శ్రీమతి విజయలక్ష్మి పండిట్ నియమించ బడింది. ఇంతకుముందు ఈస్థానంలోవున్న శ్రీ బి. యన్. చక్రవర్తి స్వదేశానికి తిరిగివచ్చారు.

*　　　*　　　*　　　*

భారతప్రభుత్వ పురావస్తు శాఖవారు, మౌర్యసామ్రాజ్య చక్రవర్తి అశోకునికాలంనాటి శాస నాన్ని ఒకటి కనుగొన్నారు. ఈ శాసనంలో అశోకుని పేరు వ్రాసివున్నది. అశోకుని పేరు వ్రాసివున్న శాసనం లోగడ ఒక్కటిమాత్రమే లభించింది.

*　　　*　　　*　　　*

భారతప్రభుత్వఆహ్వానంపై, యుగోస్లావియా ప్రెసిడెంట్ మార్షల్ టిటో మనదేశానికివచ్చారు. ఆయన డిసెంబర్ 16 న బొంబాయిలో దిగగానే బ్రహ్మాండమైన స్వాగతం యివ్వబడింది. ఆయన ఢిల్లీవెళ్ళి ప్రధాని నెహ్రూనూ, రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌గారినీ కలుసుకున్నారు.



ప్రస్తుత మున్న గ్రహకూటమిలో మరొక కొత్త గ్రహం వున్నట్లు అమెరికా ఖగోళశాస్త్రజ్ఞుడు జార్జి ఏబెల్ అనే ఆయన కనిపెట్టాడు.

*   *   *   *

విలువిద్యలో నిపుణులైన కొండజాతులవారికి పోటీలుపెట్టి సాలీనా బహుమతులివ్వటానికి ఆంధ్రప్రభుత్వం నిర్ణయించింది. ఇందుకుగాను 1050 రూపాయలు మంజూరుచేయ బడ్డాయి. తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, విశాఖపట్టణం జిల్లాలలోని ఏజన్సీ ప్రాంతాలలో కొండజాతులవారు నివసిస్తున్నారు.

*   *   *   *

అఖిలభారత కాంగ్రెస్ సమావేశం ఈసారి మద్రాసుకు సమీపంలో వున్న ఆవడిలో జనవరి 15, 16 తేదీలలో జరుగుతుంది. ఈ సమావేశానికి హాజరయేముందు ప్రధాని నెహ్రూ జన వరి 13, 14 తేదీలలో ఆంధ్రదేశ పర్యటన చేస్తారు. విశాఖపట్టణము, రాజమండ్రి, విజయ వాడ, కడప పట్టణాల్లో ఆయన ఉపన్యసిస్తారు.

*   *   *   *

విజయవాడకు సమీపంలోని గన్నవరం విమానాశ్రయంవద్ద ఫ్లైయింగ్ క్లబ్బుకు జనవరి 14 వ తేదీన ప్రధాని నెహ్రూ ప్రారంభోత్సవం చేస్తారని తెలుస్తున్నది.

*   *   *   *

జాతీయ విస్తరణ బ్లాకులలో పనిచేసే గ్రామసేవకుల శిక్షణకుగాను రెండు బేసిక్ అగ్రి కల్చరల్ స్కూళ్ళు ప్రారంభించడానికి ఆంధ్రప్రభుత్వం నిశ్చయించింది. ఇందులో ఒకటి కర్నూలుజిల్లాలోను, రెండవది గుంటూరుజిల్లా బాపట్లలోనూ నెలకొల్పబడతాయి.

*   *   *   *

ఇండియా కేంద్ర ప్రభుత్వంలో ఏడుగురు కొత్త మంత్రులు నియమించబడ్డారు. వారు శ్రీయుతులు హరివినాయక్ పటస్కర్, కేశవదేవ మాలవియా, మణిలాల్ చతుర్భాయ్ షా, అరుణ్‌చంద్రగుహా, డాక్టర్ సయ్యిద్‌మహ్మద్, మెహర్‌చంద్‌ఖన్నా, పండిట్ పంత్‌గార్లు.



# చిత్రకథ



ఒక రోజున వాసు; దాసువాళ్ళ ఇంటికి వెళ్ళాడు. అక్కడ బెంచీమీద మూడు పెద్ద గుమ్మడికాయలు పెట్టివున్నయ్. 'చిన్న తమాషా చేద్దాం, పని మనిషిని హడలకొట్టాలి!' అంటూ వాసు తన జేబులోవున్న చాకు తీసి దానితో గుమ్మడికాయలకు కళ్ళూ, నోరూ కోశాడు. దాసు వాటికి రంగులు పూశాడు.




సరీగా పనిమనిషి వచ్చేవేళకు దాసూ, వాసూ గుమ్మడికాయల వెనక చేరారు. వాళ్ళను చూచి 'టైగర్' కూడా ఒక గుమ్మడికాయ వెనక చేరింది. పని మనిషి బెంచీదగ్గరకు వస్తూనే, నవ్వుతూన్న రాక్షసుల తలల ఆకారం చూసి ఒక పెద్ద కేకపెట్టి పారిపోయింది. దాసూ, వాసూలు బాగా నవ్వుకున్నారు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by P. S. Khambata



బహుమతి
పొందిన వ్యాఖ్య

నాతో నేనే ఆలోచిస్తా

పంపినవారు :
ఎం. వి. చలం - రాజమండ్రి

